స్వధర్మే నిధనం శ్రేయః.

చిదానందాశ్రమ గ్రంథమాల. ౮-వ సంఖ్య.

# ఆబ్దికమన్త్రములు.

సస్వరాంధ్రప్రయోగము.

క. మార్కండేయశర్మచేత

విద్యారణ్యభాష్యము ననుసరించి

ఆంధ్రటీకాతాత్పర్యములు వ్రాయబడినది.

శ్రీ దైవాద్వైతమతస్థాపక కోటీశ్వరశర్మ శాస్త్రిగారిచేత

పరిష్కరింపఁబడినది.

౨-వ ముద్రణము ౨౦౦౦ కాపీలు.

దీక్షితసంవత్. ౧౧౭



1925

[~~వెల ౦-౮-౦~~

# ఆబ్దికమంత్రములకు ఉపోద్ఘాతము.

అధ్యయనాదులచేతను చిరకాలము గురుకుల వాసముచేతను తెలిసికొనఁదగిన శాస్త్రీయరహస్యము లన్నిటిని వ్రాసి జనులకు తెలియఁజేయుట అశక్యమయినకార్యము. అయినను ప్రకృతమున గురుకులవాసము వేదవిద్యలు, అను పదములు నిఘంటువులయందుమాత్రమే సాధారణముగ గనంబడుచుండుటచేత సాధ్యమయినంత విపులముగ విమర్శించి వ్రాసి ముద్రించి మతాచారవిధులయందు శ్రద్ధగలవారి ఎదుటను ధర్మానుసారులరెదుటను ఈ గ్రంథము నుంచుచున్నారము. పండితులగువారలు దూలోపములఁ దెలిపిరేని కృతజ్ఞులమయి సంస్కరించుకొనియెదము. మేమీ గ్రంథమాల ముద్రించువిషయమెంగులకయినది చదువరులకు స్వల్పముగ తెలుపుట యావశ్యకమైనను మే మిదివరకె ముద్రించిన 'తైత్తిరీయస్మార్తబార్హిస్పత్య నిత్యకర్మాష్టకము అను గ్రంథముయొక్క ౪౦౦౦ ప్రతులు అతిస్వల్పకాలములోననే మతాభిమానులు ఆదరించి యుండుటచేత మేము విశేషముగ వ్రాయపనిలేదు.

మూల గ్రంథములగు వేదములను స్వప్నమునందైనను పరీశీలింపక యీ "వేదములందు అవిలేవు, ఇవిలేవు" అని నిర్ణయించు విమర్శకులు పలువురు ఇపుడిపుడు బయలుదేరుచున్నందులకు విమర్శకులు చింతింపవలసియున్నది. మొననమొన్న ఒక విమర్శకంమన్యుఁడు మా సమీపమునకు వచ్చి ఆయావిషయములు మాట్లాడుచు "మీరు వేద గ్రంథములు చూచుచున్నారుగదా! ఋగ్వేదమున "పితృ" శబ్దముగాని తద్వర్ణనముగాని యున్నదని మీరు చెప్పఁగలరా" అనివాదించిరి. వారిస్థితినిచూచి జాలిజెందితిని.

## వేదములు, పితృదేవతలు.

వేదములందు పితృదేవతలను గురించిన వర్ణనముగలదా? లేదా? యనువిషయము ప్రకృతమున మనకు విచారణీయము. ప్రాక్పశ్చిమ దేశీయపండితులందఱచేతను ప్రాచీనతమ మని అంగీకరింపఁబడుచున్న ఋగ్వేదమునందే పితరులను గురించిన వర్ణనముచేయు మంత్రము లుండుటయేగాక దశమమండలమున ప్రత్యేకము 'పితృసూక్తము'ను పేరుతో నొక సూక్తముకూడ గలదు.

పితరులు త్రివిధులుగనుందురని ఋగ్వేదము నందు దహరింపఁబడిన ఒకఋక్కునిచట నుదహరించుచున్నాను.

**ఉదీరతా మవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితర స్సోమ్యాసః।
అసుం య ఈయు రవృకా ఋతజ్ఞా స్తేనోఽవన్తు పితరో హవేషు॥**

ఋ॥ మం॥ ౧౦॥ ౧౫॥ ౧॥

ఉదీరతా మవర ఉదీరతాంపర ఉదీరతాం మధ్యమాః పితరః సోమ్యాః సోమసంపాదినః తేఽసుం యేప్రాణ మన్వీయు రవృకా అనమిత్రాః సత్యజ్ఞావా యజ్ఞజ్ఞావా తే న ఆగచ్ఛంతు పితరో ఆహ్వానేషు॥

నిరు॥ ౧౧॥ ౨॥ ౯॥

అని నిరుక్తమున వ్యాఖ్యానము చేసియున్నారు.

కర్మకాండయందు కొన్నికర్మలు ప్రకృతులనియు కొన్నివికృతులనియు చెప్పఁబడియున్నవి. పితరులను గుఱించి మనము చేయు శ్రాద్ధాదిసకలవిధులు వేదమునందు చెప్పఁబడిన పిండపితృయజ్ఞము ననుసరించి చేయఁబడుచున్నవి. కొన్ని మాత్రము సూత్రోక్తమగు మాసిశ్రాద్ధము ననుసరించి చేయఁబడుచున్నవి. వీనిని గుఱించి సామాన్యముగ ధర్మశాస్త్రములందు "పిండపితృయజ్ఞ ప్రకృతికములనియు, మాసిశ్రాద్ధ ప్రకృతికములనియుచెప్పెదరు. మాసికాదికము, ప్రత్యాబ్దికము, సపిండీకరణము ఇవి పిండ పితృయజ్ఞముననుసరించి చేయవలయును, తక్కినవన్నియు మాసిశ్రాద్ధము ననుసరించి చేయవలయును. ఈపిండపితృయజ్ఞమును గుఱించిన వివరము తైత్తిరీయబ్రాహ్మణమున వివరముగ తెలుపఁబడియున్నది. వివరమును తెలుపు వాక్యములనుమాత్ర మిచట కొన్నింటిని వ్రాసెదను.

"ఇంద్రో వృత్రగ్ం హత్వా।........ తేపితరః పూర్వేద్యురాగచ్ఛన్। పితౄన్ యజ్ఞోఽగచ్ఛత్।....తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే। ....సోమాయపితృపీతాయ స్వధానమ ఇత్యాహ।....అగ్నయే కవ్యవాహనాయ స్వధానమ ఇత్యాహ।యఏవపితృణామగ్నిః।తం ప్రీణాతి।తిస్ర ఆహుతీర్జుహోతి। త్రిర్నిదధాతి।....తూష్ణీంమేక్షణమాదధాతి।....తిస్ర ఆహుతీర్జుహో।తి....సకృదాచ్ఛిన్నం బర్హిర్భవతి । సకృదివహి పితరః। త్రిర్నిదధాతి । తృతీయేవా ఇతోలోకేపితరః । తానేవప్రీణాతి । పరాజావర్తతే । హ్లీకాహిపితరః।.... అవఘ్రేయమేవ । తన్నేవప్రాశితన్నేవాప్రాశితం।....దశాంఛిన త్తి।హారణభాగాహిపితరః । పితౄనేవనిరవదయతే।....నమస్కరోతి।నమస్కారోహిపితృణాం।....యఏవం విద్వాన్ పితృభ్యఃకరోతి। ఏవమ్వై మనుష్యాణాం యజ్ఞః। .... తేనవాఏతత్ పితృలోకే చరతి । యత్పితృభ్యః కరోతి।....నప్రమాయుకో భవతి । పితృలోకేవా ఏతద్యజమానశ్చరతి॥ తై॥ బ్రా॥ ౧-౩-౧౦.

అగ్నయే దేవేభ్యః పితృభ్యస్సమిధ్యమానాయాను బ్రూహీత్యాహ। ఉభయే దేహి దేవాశ్చ పితరశ్చేజ్యన్తే।....ప్రాచీనావీతీసోమం యజతి। పితృదేవత్యాహి। ఏషాఽఽహుతిః।....ఆస్వధేత్యాశ్రావయతి। అస్తుస్వధేతి ప్రత్యాశ్రావయతి।....సోమప్రయాజాహి పితరః।సోమం పితృమన్తంయజతి।సంవత్సరోవై సోమః పితృమాన్।....పితౄన్ బర్హిషదోయజతి।....అగ్నింకవ్యవాహనం యజతి। య ఏవపితౄణామగ్నిః। తమేవ తద్యజతి। ....అత్ర పితరోయథాభాగం మందధ్వ మిత్యాహ। హ్రీకాహి పితరః। ఉదఞ్చోనిష్క్రామన్తి।....ఆతమితోరుపతిష్ఠన్తే....అక్షన్నమీమదన్తహీతిగార్హపత్య ముపతిష్ఠన్తే। ....అమీమదన్తపితరస్సోమ్యా ఇత్యపిప్రపద్యన్తే।....అపః పరిషించతి।....మార్జయన్త్యేవైనాన్॥

తై॥బ్రా॥౧-౭-౯.

శతపథబ్రాహ్మణమునందు దేవపిత్రాద్యర్చనముచేయనివానిని గుఱించి ఈక్రింది విధముగ నిందించి చెప్పఁబడియున్నది:—

ఏషహవా అనద్ధాపురుషో యోనదేవానర్చతి, నపితౄన్, నమనుష్యాన్.

శతపథబ్రాహ్మణము ౭-3-౧-౧౪.

ఋగ్వేదబ్రాహ్మణమగు ఐతరేయ బ్రాహ్మణమునందును పైనయుదహరించిన శ్రుతి వాక్యము గనంబడుచున్నది.

కల్పసూత్రములందు పిండపితృయజ్ఞప్రయోగము స్పష్టముగ చెప్పఁబడియున్నది. గృహ్యసూత్రములందు మాసి శ్రాద్ధమునుగుఱించియు తద్వివరమునుగుఱించియు చెప్పఁబడియున్నది.

మృతిచెందినవారికి వారువారుచేసిన కర్మానుసారము పిత్రాదిదేహప్రాప్తి కలుగుటనుగుఱించి శతపథబ్రాహ్మణమున స్పష్టముగ చెప్పఁబడియున్నది:—

సయత్రాయగ్ం శరీర ఆత్మా బల్యం నీత్య సమ్మోహ మివ×× ××తద్యథాతృణజలూకా తృణస్యాన్తం గత్వాఽఽత్మానముపసగ్ంహరత్యేవమేవాయంపురుష ఇదగ్ం శరీరంనిహత్యావిద్యాం గమయిత్వాఽఽత్మానముపసగ్ంహరతి, తద్యథా పేశస్కారీ పేశసో మాత్రాముపాదాయాన్యన్నవతరం కల్యాణ తరగ్ంరూపంతనుత ఏవమేవాయం ఇదగ్ంశరీరం నిహత్యాఽవిద్యాం గమయిత్వాన్యన్నవతరగ్ం రూపం

తనుతే పిత్ర్యంవా గాన్ధర్వంవా బ్రాహ్మంవాప్రాజాపత్యంవాదైవంవా మానుషంఽవా న్యేభ్యోవా భూతేభ్యః॥ శతపథబ్రాహ్మణము ౧౪-౮ ౨-౧.

ఈపైన గనంబఱిచిన ప్రమాణములవలన వేదములందు పితృదేవతలనుగూర్చివర్ణనములుకలవనియు, వారినిపూజించుటమనకువిధియనియు మృతిచెందినపిత్రాదులే పితృలోకమునుపొంది తదభిధానముచేత చెప్పఁబడుచున్నారనియు సులభముగ తెలిసికొనవచ్చును. నేనుదహరించిన వచనములయర్థము సులభముగ తెలియుచుండుటచేత అర్థము మొదలగునవి వ్రాయలేదు.

వేదములందచ్చటచ్చట "పితృ"శబ్దము గనంబడుచున్నది గాని పితామహ ప్రపితామహశబ్దములు గనంబడుటలేదని కొందఱనవచ్చును; గాని అట్లనవలసిన యవసరమంతగా గనంబడదు. అట్లుగాక పితామహ ప్రపితామహులనుగుఱించి చెప్పినమంత్రములు వేదములనుండి మాకు చూపవలయు నని పట్టుపట్టెడివారి కుదేవిధంబుగ నీక్రింద నట్టిమంత్రములఁ గొన్నిఁటి నిచ్చుచున్నాము.

"పితృభ్యస్సుస్వధా విభ్యస్సుస్వధానమః।పితామహేభ్యస్సుస్వధా విభ్యస్సుస్వధానమః।ప్రపితామహేభ్యస్సుస్వధావిభ్యస్సుస్వధానమః। అక్షన్పితరః। అమీమదన్తపితరః। అతీతృపన్తపితరః। అమీమృజన్తపితరః। పితరశ్శున్ధధ్వం। పునన్తుమాపితరస్సోమ్యాసః। పునన్తుమాపితామహాః। పునన్తుప్రపితామహాః। పవిత్రేణశతాయుషా। పునన్తుమాపితామహాః। పునన్తుప్రపితామహాః। యేసజాతాస్సమనసః। జీవాజీవేషుమామకాః। తేషాగ్ శ్రీర్మయికల్పతాం।అస్మిల్లోకేశతగ్ంసమాః। ద్వేసృతీఅశ్రుణవంపితృణాం। అహం దేవానా ముతమర్త్యానాం। యాభ్యామిదంవిశ్వమేజత్సమేతి। యదన్తరా పితరం మాతరం....రాయస్పోష మిష మూర్జమస్మాసు దీధరత్స్వాహా॥ తై॥ బ్రా॥౨-౬-3.

ఇతరవేదములందును ఈవిషయమునుగుఱించిన మంత్రము లున్నను గ్రంథవిస్తరభీతిచేత వానిని ఇచట వ్రాయుటమానితిమి. ఈవిషయము నింతటితోవిడిచి ప్రత్యాబ్దికప్రయోగమునకు సంబంధించిన ధర్మశాస్త్రాంశముల కొన్నిటిని చర్చించుచున్నాము.

## శ్రాద్ధభేదములు.

శ్రాద్ధమనఁగా పితరలనుగూర్చి శ్రద్ధతో సకాలమున విప్రులకు అన్నాదికము నిచ్చుటయని బ్రహ్మాండపురాణమున చెప్పఁబడియున్నది.

శ్లో॥ దేశే కాలేచ పాత్రేచ శ్రద్ధయా విధినాచ యత్।
పితౄ నుద్దిశ్య విప్రేభ్యో దత్తం శ్రాద్ధముదాహృతం॥
ప్రేతం పితౄంశ్చ నిర్దిశ్య భోజ్యం యత్ప్రియమాత్మనః।
శ్రద్ధయా క్రియతే యత్తు తచ్ఛ్రాద్ధం పరికీర్తితమ్॥

స్మృతిముక్తాఫలే శ్రాద్ధకాండే మరీచిః.

ఆశ్రాద్ధము పార్వణము, ఏకోద్దిష్టము, అని ద్వివిధము. ఒకనినుద్దేశించి చేయు శ్రాద్ధమునకు ఏకోద్దిష్ట శ్రాద్ధమనిపేరు. పురుషత్రయమునుద్దేశించి చేయుశ్రాద్ధమునకు పార్వణ శ్రాద్ధమనియుపేరు.

నిత్య, నైమిత్తిక, కామ్యభేదములచేత శ్రాద్ధములు త్రివిధముగ విభజింపఁబడి యున్నవి.

నిత్యశ్రాద్ధములు:—ప్రత్యాబ్దికము, ప్రత్యహము పితరులనుద్దేశించి చేయుశ్రాద్ధము. దర్శశ్రాద్ధము. మహాలయము. ఇవి నిత్యశ్రాద్ధములు.

నైమిత్తికశ్రాద్ధములు:—గ్రహణములు, సంక్రాంతులు మొదలగునిమిత్తములు సంభవించినపుడు చేయవలసినశ్రాద్ధములు నైమిత్తికశ్రాద్ధములు.

కామ్యశ్రాద్ధములు:—ఆయాతిథులయందును నక్షత్రములందును చేయవలసిన దనిచెప్పినశ్రాద్ధములు.

దీనినిగురించి ఇంకయుతెలుపవలసిన విశేషవిచారము కలదుగాని అప్రకృతమగుటచేత మానడమయినది.

ప్రమాణవచనములు.

శ్లో॥ మృతాహేఽహరహర్దర్శే శ్రాద్ధంయచ్చ మహాలయే।
తన్నిత్యముదితం సద్భిర్నిత్యవత్తద్విధానతః॥
ప్రేతశ్రాద్ధం సపిండత్వం సంక్రాన్తిగ్రహణేషుచ।
సంవత్సరోదకుంభంచ వృద్ధిశ్రాద్ధం నిమిత్తతః॥
తిథ్యాదిషుచ యచ్ఛ్రాద్ధం మన్వాదిషు యుగాదిషు।
అలభ్యేషుచయోగేషు తత్కామ్యం సముదాహృతం॥

స్మృతిముక్తాఫలే శ్రాద్ధకాండే కార్ష్ణాజనిః.

సంకల్పవివరము.

తల్లికి:-మాతృ, పితామహీ, ప్రపితామహీనాం, అనియు
తల్లితల్లికి:-మాతామహీ,మాతుఃపితామహీమాతుః ప్రపితామహీనాం అనియు

తండ్రితల్లికి:-పితామహీ, ప్రపితామహీ,వృద్ధప్రపితామహీనాం, అనియు
సవతితల్లికి:-సాపత్నిమాతృ, పితామహీ, ప్రపితామహీనాం, అనియు
పితామహునకు:-పితామహ, ప్రపితామహ, వృద్ధప్రపితామహానాం ,,
అన్నకు:—జ్యేష్ఠభ్రాతృ, పితృ పితామహానాం. ,,

ఇట్లు ఊహించి చెప్పుకొనవలయును.

వర్గత్రయమునందు మధ్యను ఎవరైన జీవించియుందురేని వెనుకటి వానినే మఱల నొకపర్యాయముచెప్పి-3-వ వారినామముచెప్పవలెను; ఉదాహరణము:—పితామహి జీవించియుండగా తల్లికి ఆబ్దికము పెట్టునపుడు, "మాతృ, మాతృ, ప్రపితామహీనాం, అనియు, భార్యకు ఆబ్దికముపెట్టునపుడు తల్లి జీవించియుండునేని "పత్ని, పత్ని, పితామహీనాం" అనియు ఈ ప్రకారము అన్నితావులయందు చూచుకొనవలయును.

ఉపవీతనిమిత్తములు.

౧ ఆచమనమునందును
౨ అగ్నిముఖమునందును
౩ అధిశ్రవణపతనమందును
౪ అనువ్రజనమందును
౫ ప్రదక్షిణమునందును
౬ ప్రాయశ్చిత్తహోమమునందును
౭ ఆఘారసమిత్ హోమమందును
౮ ఆజ్యభాగహోమమునందును
౯ ఆఘార ,,
౧౦ స్విష్టకృత్ ,,
౧౧ ప్రాణాయామమునందును
౧౨ నమస్కారమునందును
౧౩ నిహూహనమునందును
౧౪ ఉద్వాసనమునందును
౧౫ పరిధాధానమందును
౧౬ లేఖనమునందును
౧౭ ఉల్లేఖమునందును
౧౮ అన్నసూక్తపఠనమందును
౧౯ పితృస్తోత్రమందును
౨౦ జపమునందును
౨౧ పడ్డించునపుడును
౨౨ బ్రాహ్మణవిసర్జనమందును
౨౪ స్వాగతమందును
౨౫ ప్రార్థనయందును
౨౬ స్వస్తివాచనమునందును
౨౭ పిండాఘ్రాణమునందును
౨౮ దక్షిణ ఇచ్చునపుడును
౨౯ ప్రత్యుత్థానమందును

కర్త ఉపవీతియై సలుపవలెను.

తదితరస్థలములందు ప్రాచీనావీతియై సలుపవలెను. ఈవిషయము పితృస్థానవిషయము. విశ్వేదేవస్థలమున సర్వమ్మును ఉపవీతముగనే సలుపవలెను.

## ధర్మశాస్త్రప్రవచనాని.

### ఉపవీత ప్రాచీనావీతనిమిత్తాని.

నిమన్త్రణ ప్రభృత్యాశ్రాద్ధపరిసమాప్తే ర్వైశ్వదైవికం ప్రదక్షిణం యజ్ఞోపవీతినాకార్యం; పిత్ర్యమపసవ్యం ప్రాచీనావీతినాకార్యం:—

శ్లో॥ యజ్ఞోపవీతీ దేవానాం కుర్యాత్సర్వం ప్రదక్షిణం।
అపసవ్యంతతఃకృత్వా పిత్ర్యాణామ ప్రదక్షిణమ్॥

శ్లో॥ దక్షిణాగ్రాశ్చదర్భాస్స్యుః సచవై దక్షిణాముఖః॥

ఇతిస్మరణాత్.

తా. నిమంత్రణము మొదలు శ్రాద్ధము పరిసమాప్తియగునంతదనుక "విశ్వేదేవస్థానమున చేయుపనియంతయు ఉపవీతియై ప్రదక్షిణముగ చేయవలయును. పితృస్థానమున ప్రాచీనావీతియై అప్రదక్షిణముగ చేయవలయును.

పితృమేధసారకృత్:—సర్వం దేవార్థముపచారం ఉపవీతీ, ప్రాఙ్ముఖః, ప్రదక్షిణం, ప్రాగగ్రైర్దర్భైః, దేవతీర్థేన, పూర్వం, కృత్వా; పితృభ్యస్సర్వం దక్షిణాముఖః కుర్యాత్; పిత్రనంతరం దేవవత్సర్వం విష్ణోః కుర్యాత్ ఇతి;

తా. దేవస్థానమున చేయు ఉపచారము ఉపవీతియై ప్రాఙ్ముఖుఁడై ప్రాగగ్రదర్భలతో ప్రదక్షిణముగ సలిపి పిదప పితరులకు దక్షిణాముఖముగ చేయవలయును. పిత్రర్చనాంతమున దేవస్థానమునందువలె విష్ణుపూజ సలుపవలెను.

స్మృత్యంతరేపి"—

శ్లో॥ ఉదఙ్ముఖస్తు దేవానాం పిత్ర్యాణాందక్షిణాముఖః।
ప్రదద్యాత్పార్వణేసర్వం దేవపూర్వం విధానతః॥ ఇతి

యథాశాస్త్రముగ ప్రథమమున నుదఙ్ముఖుఁడై దేవతలకును పిదప దక్షిణాభిముఖుఁడై పితరులకును పార్వణశ్రాద్ధమును సలుపవలెను.

### ఉపవీతస్థలాని.

బోధాయనః:—ఆచమనే-[1] చాగ్నిముఖే-[2] చాభిశ్రవణే-[3] చానువ్రజనే-[4] ప్రదక్షిణేషు-[5] పశ్చాద్ధోమేషు-[6] యజ్ఞోపవీతం.అన్యత్ర ప్రాచీనావీతం॥ ఇతి॥

(పశ్చాద్ధోమః ప్రాయశ్చిత్తహోమః)

అత్రకపర్దీ:—

శ్లో॥ ఆఘారదా- ర్వగ్నిముఖా-జ్యభాగ।
ప్రదక్షిణాను వ్రజనేషు తద్వత్॥
ఆఘారయోః స్విష్టకృతిః- ప్రసిద్ధం।
యజ్ఞోపవీతం హికపర్దినస్స్యాత్॥

పితృమేధసారేఽపి:—ఆసమాప్తేః ప్రాచీనావీతమన్యత్ర ప్రాణాయామ, ఆఘారహోమ ఆజ్యభాగ అగ్నిముఖ స్విష్టకృద్ధోమ, ప్రాయశ్చిత్తాహుతి అభిశ్రవణాచమన ప్రదక్షిణ,నమస్కార,అనువ్రజనేభ్యః॥ ఇతి॥

భాష్యకారః:—నిగూహా ఉద్వాసన పరిధ్యాదాన లేఖ ఉల్లేఖనాదికంపిత్ర్యేఽపి, సమానమిత్యర్థః.

స్మృత్యంతరేపి:—

శ్లో॥ సూక్త స్తోత్ర జపం త్యక్త్వా వినాచ పరివేషణం।
విసర్జనం సౌమనస్యం స్వాగతం ప్రార్థనంతథా॥
శ్లో॥ విప్ర ప్రదక్షిణంచైవ స్వస్తి వాచనకం తథా।
పిండాఘ్రాణం దక్షిణాంచ ప్రత్యుత్థానాదికం వినా॥
పిత్ర్యమన్యత్ర కర్తవ్యం ప్రాచీనావీతినాసదా॥ ఇతి॥

మనుః:—శ్లో॥ ప్రాచీనావీతినాసమ్యగపసవ్యమతంద్రితః।
పిత్ర్యమానిధనాత్కార్యం విధివద్దర్భపాణినా॥ ఇతి॥
ఆనిధనా దాశ్రాద్ధపరిసమాప్తేరిత్యర్థః॥

## నిమంత్రణవిధి.

ఆబ్దికాదులు రేపనగా నేటిరాత్రి తనగృహంబున నుండువారందఱు భుజించినపిదప భోక్తగా పిలువఁదలఁచిన బ్రాహ్మణునిగృహంబునకుబోయి "శ్వశ్శ్రాద్ధం భవితా తత్ర విశ్వేదేవార్థే భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః" అని విశ్వేదేవస్థానమునకును, ప్రాచీనావీతియై "శ్వశ్శ్రాద్ధం భవితా తత్ర పిత్రర్థే భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః" అని పితృస్థానమునకును భోక్తలను నిమంత్రించవలయును. మరునాఁడుదయమున మరల వారి గృహంబునకుబోయి "అద్యశ్రాద్ధం.... కర్తవ్యః" అని పూర్వోక్తప్రకారము ద్వితీయనిమంత్రణము చేయువలయును. సంకల్పానంతరముచేయు నిమంత్రణము తృతీయనిమంత్రము. నిమంత్రణ మంగీకరించిన పిదప భోక్తకు ఆశౌచాదికము సంభవించునేని ద్వితీయామంత్రణము వరకైనను మఱొకరిని నియమింపవలయును. తృతీయామంత్రణము అయినపిదప ఆశౌచాదికము సంభవించినప్పటికిన్నీ సమగ్రముదనుక ఆభోక్తయే శ్రాద్ధమునకు అర్హుఁడగును.

## ప్రమాణవచనాని.

యత్నేనైవంవిధాన్ శ్రాద్ధ మాచరిష్య న్పూర్వేద్యు ర్నిమంత్రయేత్॥
హారీతస్మృతి॥ ౧౩॥ ౨౯॥

శ్లో॥ శ్వఃకర్తాఽస్మీతినిశ్చిత్య దాతా విప్రాన్నిమంత్రయేత్।
నిరామిషంసకృద్భుక్త్వా సర్వభుక్తజనేగృహే॥
అసంభవేపరేద్యుర్వా బ్రాహ్మణాన్ తాన్నిమంత్రయేత్॥
పరాశర మాధవీయే ఆచారకాండే 3 అధ్యాయె దేవలః.

## శ్రాద్ధీయ ద్రవ్యములు.

శ్రాద్ధమునకు ఇవ్వదగిన కూరలు ఫలములు మొదలగువానిని సుప్రసిద్ధములగు వానిని కొన్నింటిని తెలిపి పిదప నిషిద్ధముల తెలియజేయుచున్నాము.

| శాకములు. | ఫలములు. | వర్జ్యద్రవ్యములు. |
|---|---|---|
| అరటికాయ | దానిమ్మపండు | కందులు |
| పొట్లకాయ | ద్రాక్షపండు | అలచందులు |
| దోసకాయ | ఖర్జూరపండు | ఉలవలు |
| బీరకాయ | మామిడిపండు | కొఱ్ఱలు |
| కాకరకాయ | అరటిపండు | జొన్నలు |
| పనసకాయ | మొదలగు ఫలములను | వంకాయలు |
| గుమ్మడికాయ | శక్తికొలది ప్రయత్నముచేసి | బూడిదగుమ్మడి |
| కొబ్బరి | శ్రాద్ధమునం దుపయోగించ | సొరకాయ |
| కంద | వలయును. | జామకాయ |
| ముండ్లవంకాయ | | వెలగపండు |
| పిప్పలి | | వరిగలు |
| దబ్బకాయ | | మునగ |
| మొదలగునవియు. | | మొదలగునవి వర్జ్యములు. |

మినుములు ఆబ్దికమునందు తప్పక చేర్చవలయును. సూపమునకు పెసలపప్పే వాడవలయును. గోధుమలు, ఆవాలు, తిలలు వీనిని తప్పక శ్రాద్ధపాకమున చేర్చవలయును. అనగా వీనితో భక్ష్యాదులనో లేక వ్యంజనములనో చేయవలయును. భోక్తలకు పలాశపత్రములను (మోదుగఆకులతో కుట్టిన విస్తళ్లు) గాని లేదా కదళీపత్రములను గాని ఉపయోగింపవలయును. శ్రాద్ధమునందు ప్రథమమున అన్నము పిదప పాయసము తరువాత భక్ష్యములు పిమ్మట వ్యంజనములు ఇటులవడ్డించవలయును. లవణమును ప్రత్యేకముగ వడ్డించకూడదు. పెరుగుతో కలిపి వడ్డించుట సంప్రదాయముగనున్నది.

## శ్రాద్ధనిమంత్రణమునకు యోగ్యులు. ముఖ్యకల్పము.

౧ సర్వవేదపారగః = నాలుగువేదములు సమగ్రముగ చదివినవాఁడు
౨ వేదపారగః = ఒకవేదము సమగ్రముగ చదివినవాఁడు
౩ అరోగీ=రోగరహితుఁడు
౪ చరితవ్రతః=ఆశ్రమనియమముల నెరవేర్చినవాఁడు
౫ విద్యాశీలగుణాన్వితః=విద్య, ఆచరణము,సద్గుణములుగలవాఁడు
౬ శ్రోత్రియపుత్రః=శ్రోత్రియుని కుమారుఁడు
౭ శ్రోత్రియః=శ్రోత్రియుఁడు
౮ బ్రహ్మవిత్=బ్రహ్మవేత్త
౯ యువా=యౌవనుఁడు
౧౦ వేదార్థవిత్=వేదార్థము తెలిసినవాడు
౧౧ జ్యేష్ఠసామా = "ఉదుత్యంచిత్రం" అను సామము నెల్లప్పుడు గానము చేయువాఁడు.
౧౨ త్రిమధుః "మధువాతా" అను అనువాకము నెల్లపుడు పఠించువాఁడు
౧౩ త్రిణాచికేతః = నాచికేతోపాఖ్యానము సదాపఠించువాఁడు
౧౪ త్రిసుపర్ణకః = త్రిసుపర్ణానువాకమును సర్వదాపఠించువాఁడు
౧౫ కర్మనిష్ఠః=శాస్త్రీయకర్మల నొనర్చువాఁడు
౧౬ తపోనిష్ఠః=తపముచేయువాఁడు
౧౭ పంచాగ్నిః=పంచాగ్ని మధ్యమున తపస్సుచేయువాఁడు
౧౮ బ్రహ్మచారీ=బ్రహ్మచారి
౧౯ పితృమాతృపరః=మాతాపితరుల పూజించువాఁడు
౨౦ ఛందోగాః = సామవేదము చదివినవాఁడు
౨౧ వేదవిద్యావ్రతస్నాతకః=వేదము చదివి స్నాతకవ్రతముచేసికొనినవాడు
౨౨ స్వధర్మనిరతః=స్వధర్మరతుఁడు
౨౩ శాన్తః=శాన్తుఁడు
౨౪ యతిః=సన్యాసి
౨౫ సాధుః=సద్వృత్తిగలవాఁడు
౨౬ ధాతురక్తః=వానప్రస్థుఁడు
౨౭ ఉదాసీనోగృహస్థః= సంబంధములేని గృహస్థు
౨౮ మునిః=మననశీలుఁడు
౨౯ బ్రహ్మదేయాసుతః = బ్రాహ్మవివాహముగల కన్యకు జనించినవాఁడు
౩౦ భావశుద్ధః=భావశుద్ధిగలవాఁడు
౩౧ సహస్రదః=సహస్రగోవుల దానము చేసినవాఁడు
౩౨ చాంద్రాయణవ్రతచరః= చాంద్రాయణవ్రతముచేసినవాఁడు
౩౩ సత్యవాదీ=సత్యముపలుకువాఁడు
౩౪ పురాణవిత్=పురాణజ్ఞుఁడు
౩౫ సర్వవిద్యాకుశలః=అన్నివిద్యలయందు నేర్పరి
౩౬ విముక్తః = విషయాభిలాష విడలినవాఁడు
౩౭ ధీరః=ధీరుఁడు
౩౮ అనమిత్రః=సర్వసముఁడు
౩౯ యోగపరః=యోగాభ్యాసుఁడు
౪౦ విరాగీ=వైరాగ్యముగలవాఁడు
౪౧ ధ్యానశీలః=ధ్యానముచేయువాఁడు

---

## అనుకల్పము.

స్వస్రీయః = చెల్లెలికుమారుఁడు
ఋత్విక్* = ఋత్విక్కు
జామాతా = పుత్త్రికాభర్త
యాజ్యః యాజ్యుఁడు
శ్వశురః = పిల్లనిచ్చినమామ
దౌహిత్త్రః = కూతురికొడుకు
శిష్యః* = శిష్యుఁడు
సంబంధీ = వియ్యంకుడు మొదలగువారు
బాంధవః = బంధువులు
మాతామహః = తల్లితండ్రి
గురుః = గురువు
అతిథిః = అతిథి
సోదర్యః* = భార్యాపుత్రుడు
సపిండః* = జ్ఞాతి
పితృవ్యః* = పినతండ్రి, లేక పెత్తండ్రి
పుత్త్రః* = పుత్త్రుడు
పౌత్త్రః* = పౌత్త్రుడు
అయాచక = పరులయాచించనివాఁడు
భాగినేయః = అక్కకొడుకు

### ప్రమాణవచనములు.

శ్లో॥ అనుకల్పస్త్వయం జ్ఞేయ సదాసద్భిరనుష్ఠితః।
మాతామహం మాతులంచ స్వస్రీయం శ్వశురంగురుం।
దౌహిత్రం విట్పతింబంధు మృత్విగ్యాజ్యౌచ భోజయేత్॥
మను॥ ౩॥ ౧౪౭,౧౪౮.

సూ॥ గుణవదలాభే సోదర్యోఽపి భోజయితవ్యః । ఏతేనాన్తేవాసినో వ్యాఖ్యాతాః॥ ఆప॥ధర్మ॥౨-౭-౧౭.

సూ॥ తదభావేరహస్యవిత్ ఋచోయజూంషి సామానీతి శ్రాద్ధస్యమహిమా తస్మాదేవం విధం సపిండమప్యాశయేత్॥
బోధా॥ స్మృతి॥ ౨-౮, ౧౪.

శ్లో॥ పితృవ్య గురు దౌహిత్రాన్నృత్విక్ స్వస్రీయమాతులాన్।
పూజయేద్ధవ్యకవ్యేన వృద్ధానతిథిబాన్ధవాన్॥ విష్ణుపురాణం.

శ్లో॥ పితా పితామహో భ్రాతా పుత్రోవాఽథసపిండకః।
నపరస్పరమర్ఘ్యాస్స్యుః నశ్రాద్ధం ఋత్విజస్తథా।
ఋత్విక్పుత్రాదయోహ్యేతే సకుల్యాబ్రాహ్మణాద్విజాః।
వైశ్వదేవేనియోక్తవ్యా యద్యేతేగుణవత్తరాః॥ అత్రిః.
ఏతేనాన్తేవాసినోవ్యాఖ్యాతాః॥ ఆప॥ ధ॥ ౨-౭-౧౭.

---

* వీరిని విశ్వేదేవస్థానమునందు నిమంత్రించవలయును.

## 3. భోక్తృనిమంత్రణ వర్జనీయబ్రాహ్మణాః.

రోగీ = రోగముగలవాఁడు

హీనాతిరిక్తాంగః = ఎచ్చుతగ్గులుగల అవయవములు గలవాఁడు

కాణః = ఒంటికంటివాఁడు

పౌనర్భవః = మారుమనువయిన స్త్రీకి పుట్టినవాఁడు

అవకీర్ణీ = క్షతవ్రతుఁడు

కుండః = భర్తయుండగా జారునికిపుట్టినవాఁడు

గోళకః = భర్తపోయినపిదప జారునికిపుట్టినవాఁడు

కునఖీ = పుప్పిగోటివాఁడు

శ్యావదన్తః = పాచిపండ్లవాఁడు

భృతకాధ్యాపకః = నియమితమగు వేతనముతో వేదముచెప్పువాఁడు

క్లీబః = నపుంసకుఁడు

కన్యాదూషీ = అవివాహితయగు కన్యను చెఱిచినవాఁడు

అభిశస్తకః = అగమ్యాగమనముచేత నింద్యుఁడు

మిత్రద్రోహీ=మిత్రద్రోహముచేసినవాడు

పిశునః=కొండెగాఁడు

సోమవిక్రయకః=సోమవిక్రయణము చేసినవాఁడు

పరివేత్తా = అన్నకువివాహముకాకముందు వివాహము చేసికొనినవాఁడు

మాతాపితృగురుత్యాగీ=తల్లిని తండ్రిని గురువును అకారణముగ విడిచినవాఁడు

కుండాశీ=కుండునియన్నము తినువాఁడు

వృషలాత్మజః = వివాహము కాకముందు రజస్వలయయినదానికి వివాహానంతరమునపుట్టినవాఁడు

పరపూర్వాపతిః=వివాహిత యయినదానిని మరల వివాహము చేసికొనినవాఁడు

స్తేనః=దొంగ

కర్మదుష్టః=దుష్టకర్మ లొనర్చువాఁడు

పతితః = మతాచార ధర్మముల విడిచినవాఁడు

నాస్తికః=నాస్తికప్రవృత్తిగలవాఁడు

అనధీయానః జటిలః= అధ్యయనము చేయని బ్రహ్మచారి

దుర్బలః=దుశ్చర్మగలవాఁడు

కితవః=జూదరి

పూగయాజకః=బహుయాజకుఁడు

చికిత్సకః=వైద్యజీవి

దేవలకః = పరులదేవార్చనముచేతజీవించువాఁడు

మాంసవిక్రయీ=మాంసము విక్రయించువాఁడు

విపణిజీవీ = స్వధర్మమునువిడిచి వర్తకము చేయువాఁడు

ప్రేష్యః=స్వధర్మమునువిడిచి కూలికిపోవువాఁడు

రాజసేవకః = స్వధర్మమునువిడిచిరాజసేవ చేయువాఁడు

గురుప్రతిరోద్ధా=విహితవృత్తిగల గురువునెదిరించువాఁడు

త్యక్తాగ్నిః = గార్హ్యాగ్నిని వదలినవాఁడు

వార్ధుషికః=స్వధర్మమునువదలి అన్యాయమున వడ్డివ్యాపారముచేయువాఁడు

పశుపాలకః=స్వధర్మమునువదలి పశుపాలనచేత జీవించువాఁడు

నిరాకృతిః=వేదముచదువనివాఁడు

బ్రహ్మద్వేషీ = బ్రాహ్మణుల ద్వేషించువాఁడు

గణాభ్యన్తరః=సంఘద్రవ్యముచే జీవించువాఁడు

నటః=నాట్యజీవి

వృషలీపతిః=రజస్వలయినదానిని వివాహము చేసికొనినవాఁడు
గృహే ఉపపతికః= గృహమునందే జారు నుంచుకొనిన భార్యగలవాఁడు
భృతకాధ్యాపితః = నియమితమయిన ధనములో అధ్యయనము చెప్పువానిదగ్గఱ చదివినవాఁడు
శూద్రశిష్యః=శూద్రునకు శిష్యుఁడు
శూద్రగురుః=శూద్రునకు గురువు
పతితసంసర్గీ = పతితులతో సంసర్గముగల వాఁడు
అగారదాహీ=కొంపలకాల్చువాఁడు
గరదః=విషముపెట్టువాఁడు
సముద్రయాయీ = సముద్రయాత్ర చేయువాఁడు
వందీ=స్తుతిపాఠకుఁడు
తైలికః తిలఘాతకుఁడు
కూటకారకః = అబద్ధపు సాక్ష్యమాడువాఁడు
పిత్రా వివదమానః = తండ్రితో పోట్లాడువాఁడు
కేకరః=మెల్లచూపుగలవాఁడు
మద్యపః=కల్లు ద్రావువాఁడు
దాంభికః=డాంబికుఁడు
రసవిక్రయీ=రసవిక్రయము చేయువాఁడు
ధనుశ్శరకృత్=విల్లునంబులు చేయువాఁడు
అగ్రేదిధిషూపతిః = అక్కకు పెళ్లికాకముందు చెల్లెలిని వివాహముచేసికొనినవాఁడు
సూతవృత్తిః=రథముతోలి జీవించువాఁడు
పుత్రాచార్యః = పుత్రుఁడు గురువుగాగలవాఁడు
భ్రామరీ=అపస్మారరోగముగలవాఁడు
అంధః=గ్రుడ్డివాఁడు
వేదనిందకః=వేదనిందచేయువాఁడు
హస్తికః=ఏనుగులకాచువాఁడు
ఉష్ట్రిదమకః=ఒంటెలకాపాడువాఁడు
నక్షత్రజీవీ=కేవల జ్యోతిశ్శాస్త్రముచే జీవించువాఁడు
పక్షిపోషకః=పక్షుల పోషించువాఁడు
యుద్ధాచార్యః= యుద్ధకర్మములబోధించువాఁడు
స్రోతోభేదకః= ప్రవహించు జలముల భేదించువాఁడు
ఆవరణరతః=ప్రవాహములనాపువాఁడు
గృహసంవేశకః = వాస్తువిద్యచే జీవించువాఁడు
వృక్షారోపకః=కూలికి చెట్లుపాతువాఁడు
శ్వక్రీడీ=కుక్కలతో నాట్లాడువాఁడు
శ్యేనజీవీ = డేగల విక్రయించి జీవించువాఁడు
హింస్రః=జీవహింసచేయువాఁడు
వృషలవృత్తిః = శూద్రులవలన జీవించువాఁడు
గణయాజకః=గణయాగము చేయువాఁడు
ఆచారహీనః=ఆచారములేనివాఁడు
నిత్యయాచనకః= సర్వదాయాచనమే వృత్తిగాగలవాఁడు
కృషిజీవీ = స్వధర్మమునువదలి వ్యవసాయముచేత జీవించువాఁడు
శిల్పజీవీ=స్వధర్మమునువదలి శిల్పములచేత జీవించువాఁడు
సన్నిందకః=సజ్జననిందచేయువాఁడు
ఔరభ్రికః=మేకలపెంచువాఁడు
మాహిషికః= వ్యభిచారిణియగు భార్యగలవాఁడు
ప్రేతనిర్యాతకః = శవవహనమే వృత్తిగాగలవాఁడు.

వీరందఱు నిమంత్రణమునకు తగరని తాత్పర్యము.

## ప్రమాణవచనములు.

శ్లో॥ యే స్తేనపతితక్లీబా యేచ నాస్తికవృత్తయః।
తాన్ హవ్యకవ్యయోర్విప్రా ననర్హాన్మనురబ్రవీత్।
జటిలం చానధీయానం దుర్బలం కితవంతథా।
యాజయన్తిచ యేపూగాన్ తాంశ్చశ్రాద్ధే నభోజయేత్।
చికిత్సకాన్దేవలకాన్మాంసవిక్రయిణస్తథా।
విపణేనచ జీవన్తో వర్జ్యాస్స్యుర్హవ్యకవ్యయోః॥
ప్రేష్యో గ్రామస్యరాజ్ఞశ్చ కునఖీ శ్యావదన్తకః।
ప్రతిరోద్ధాగురోశ్చైవ త్యక్తాగ్ని ర్వార్ధుషస్తథా॥
యక్ష్మీచ పశుపాలశ్చ పరివేత్తా నిరాకృతిః।
బ్రహ్మద్విట్ పరివిత్తిశ్చ గణాభ్యన్తర ఏవచ॥
కుశీలవోఽవకీర్ణీచ వృషలీపతిరేవచ।
పౌనర్భవశ్చకాణశ్చ యస్యచోపపతిర్గృహే॥
భృతకాధ్యాపకో యశ్చ భృతకాధ్యాపితస్తథా।
శూద్రశిష్యోగురుశ్చైవ వాగ్దుష్టః కుణ్డగోలకౌ॥
అకారణపరిత్యక్తా మాతాపిత్రోర్గురోస్తథా।
బ్రాహ్మయౌనైశ్చ సంబన్ధైస్సంయోగం పతితైర్గతః॥
అగారదాహీ గరదః కుండాశీసోమవిక్రయీ।
సముద్రయాయీ బన్దీచ తైలికఃకూటకారకః॥
పిత్రావివదమానశ్చ కితవో మద్యపస్తథా।
పాపరోగ్యభిశస్తశ్చ దామ్భికో రసవిక్రయీ॥
ధనుశ్శరాణాం కర్తాచ యశ్చాగ్రేదిధిషూపతిః।
మిత్రధ్రుగ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్యస్తథైవచ॥
భ్రామరీగండమాలీచ శ్విత్ర్యథోపిశునస్తథా।
ఉన్మత్తోఽన్ధశ్చ వర్జ్యాస్స్యుర్వేదనిందక ఏవచ॥
హస్తిగోఽశ్వోష్ట్రదమకో నక్షత్రైర్యశ్చజీవతి।
పక్షిణాంపోషకోయశ్చ యుద్ధాచార్యస్తథైవచ॥
స్రోతసాం భేదకోయశ్చ తేషాంచావరణేరతః।
గృహసంవేశకోదూతో వృక్షారోపక ఏవచ।

శ్వక్రీడీ శ్యేనజీవీచ కన్యాదూషక ఏవచ।
హింస్రోవృషలవృత్తిశ్చ గణానాంచైవయాజకః॥
ఆచారహీనః క్లీబశ్చ నిత్యంయాచనక స్తథా।
కృషిజీవీ శిల్పజీవీ సద్భిర్నిన్దిత ఏవచ॥
ఔరభ్రికో మాహిషికః పరపూర్వాపతి స్తథా।
ప్రేతనిర్యాతకశ్చైవ వర్జనీయాః ప్రయత్నతః॥
ఏతా న్విగర్హి తాచారా నపాంక్తేయా న్ద్విజాధమాన్।
ద్విజాతిప్రవరో విద్వా నుభయత్ర వివర్జయేత్॥

మనుః 3॥ ౧౫౦—౧౬౬

## పిండ ప్రమాణము

ప్రత్యాబ్దికమునందు పిండప్రదానమును ఉచ్ఛిష్టపాత్రలసమీపముననే చేయవలయును. శ్రాద్ధమున కుపయోగించిన వ్యంజనములన్నియు కలిపి 3 పిండములను చేయవలయును. ప్రత్యాబ్దికమునందును మాసికమునందును నారికేళపరిమాణముగల పిండముల నొసగవలయునని శాస్త్రసిద్ధాంతము. కపిత్థ బిల్వ ఫలమానముగ నొసగవచ్చుననియు కొందఱిమతము.

## ప్రమాణవచనములు.

శ్లో. కపిత్థబిల్వమాత్రాన్వా పిండాన్ దద్యాత్సమాహితః।
తత్సమంవికిరందద్యా త్పిండాం తేషుసుసంయతః॥ సుమన్తుః

శ్లో. ఏకోద్దిష్టేసపిండేచ కపిత్థస్తు విధీయతే।
నారికేళ ప్రమాణంతు ప్రత్యబ్దే మాసికేతథా॥
తీర్థేధర్శేచసంప్రాప్తే కుక్కుటాండ ప్రమాణతః।
మహాలయే గయాశ్రాద్ధే కుర్యాదామలకోపమం॥ హేమాద్రిః

## పిండ ప్రదానమునందు:—

శ్లో. శమీపత్ర ప్రమాణేన పిండందద్యాద్గయాశిరే।
ఉద్ధరేత్స ప్తగోత్రాణి కులమేకోత్తరం శతం॥

అని చెప్పియున్నది. అందుఏకోత్తరశతకులములకు వివర మీవిధముగ చెప్పబడియున్నది.

శ్లో. పితా మాతాచ భార్యా చ భగినీ దుహితా తథా।
పితృ మాతృష్వసా చైవ సప్తగోత్రాణివై విదుః॥

శ్లో. తత్త్వాని వింశతి నృపా ద్వాదశైకాదశా దశ।
అష్టౌ వితిచగోత్రాణాం కులమేకోత్తరం శతం॥

### పిండవినియోగము.

పుత్రార్థియగువాడు మధ్యమపిండమును (పితామహపిండమును) "శ్లో. ఆధత్తపితరోగర్భ మత్రసంతానవర్ధనమ్" అను మంత్రమునుపఠించి తనభార్య కివ్వవలయును. అదివరకు పుత్రులులేకపోయిన ఇవ్వవలయునుగాని ఉన్నయెడల అక్కరలేదు. పితరులయందు శ్రద్ధలేనిభార్యకు ఇవ్వఁగూడదు. పుత్రార్థికానివాఁడు ఆపిండమును తక్కినపిండములతోపాటు ఆవుకు పెట్టవచ్చును. లేక జలమునందు కలుపవలయును.

### ప్రమాణవచనములు.

శ్లో. పత్నైశ్చప్రజార్థం దద్యాత్తు మధ్యమం మంత్రపూర్వకమ్॥
వాయుపురాణము.

శ్లో. పతివ్రతాధర్మపత్నీ పితృపూజనతత్పరా।
మధ్యమన్తు తతఃపిండ మద్యాత్సమ్యక్సుతార్థినీ॥ మనుః.
పత్నీమధ్యమపిండమశ్నీయా దార్తవస్నాతా॥ శంఖలిఖితౌ.
ఆర్తవస్నాతా=అగృహీతగర్భా.
తతః కర్మణి నిర్వృత్తే పిండాశ్చ తదనంతరం।
బ్రాహ్మణోఽగ్నిరజోగార్వాభక్షయేదప్సువాక్షిపేత్॥ దేవలః.

ఏతత్ పుత్రార్థిత్వాభావవిషయం, తత్సద్భావేమధ్యమపిండవ్యతిరిక్తపిండాంతరవిషయంవా. వైద్య॥ శ్రాద్ధకాండే.

### అగ్నౌకరణవిధి.

ఔపాసనాగ్నియందు అగ్నౌకరణహోమము "తల్లిదండ్రులకు, మాతామహ మాతామహీలకు, జ్యేష్ఠభ్రాత, సాపత్నిమాత" వీరి యాబ్దికములందుమాత్రమే ఔపాసనాగ్నియందు చేయవలయును. తక్కినవారి యాబ్దికములందు లౌకికాగ్నియందే చేయవలయును. విధురుఁడు బ్రహ్మచారి వీరు తాము పెట్టవలసిన ఆబ్దికములందు లౌకికాగ్నియందే అగ్నౌకరణహోమము చేయవలయును.

### పాత్రచాలనము.

భోజనాంతరమున స్వస్తివాచనముకంటె పూర్వమున భోక్తలు భుజించినపాత్రములను తానుగాని కుమారుఁడుగాని లేక శిష్యుఁడుగాని ఎత్తి వానినిగోతియందుపూడ్చిపైన మట్టికప్పవలయును. ఉపనయనముగాని బాలురును స్త్రీలును వానిని ఎత్తకూడదు. వానిని కుక్కలు మొదలగునవి తాఁకునటుల పారవేయుట తప్పు.

## ప్రమాణవచనములు.

శ్లో. "భాజనేషుచ తిష్ఠత్సు స్వస్తికుర్వన్తి యేద్విజాః।
తదన్నమసురై ర్భుక్తం నిరాశైః పితృభి ర్గతైః॥ బృహస్పతిః.

శ్లో. పాత్రాణి చాలయేచ్ఛ్రాద్ధే స్వయం శిష్యోఽథవా సుతః।
నస్త్రీభిర్నచబాలేన నాసజాత్యా కథంచన॥ జాతుకర్ణిః.

శ్లో. శ్రాద్ధ ఉచ్ఛిష్టపాత్రాణి గర్తే నిక్షిప్యగోపయేత్।
మృద్భి రాచ్ఛాదయేచ్ఛ్వాది ర్యథానస్పృశతేతథా॥

వైద్యనాథీయ స్మృతిముక్తాఫలే శ్రాద్ధకాండే.

## స్త్ర్యాదికర్తృక శ్రాద్ధవిధి.

స్త్రీలుగాని అనుపనీతులుగాని శ్రాద్ధము చేయవలసివచ్చునేని "మదర్థం భవన్తః కుర్వన్తు" అని చెప్పి ఒక బ్రాహ్మణుని నియమించి వానిచేతనే శ్రాద్ధకర్మ నంతయు జరిపించవలయును. స్త్రీకర్తృకమగు ఆబ్దికమునాడు ఆస్త్రీ రజస్వలయగునేని ఐదవనాఁడు శుద్ధిస్నానముచేసినపిదపనే వేఱొక బ్రాహ్మణుని నియమించి వానిచేత ఆబ్దికకర్మ జరిపించవలయును. జననమరణాశౌచములం దంతరించిపోయిన ప్రత్యాబ్దికమును శుద్ధిదినమున స్నానమొనర్చి జరిపించవలయును. దర్శశ్రాద్ధము మాసికములు ఇవి ఆశౌచమధ్యమునవచ్చునేని వానిని శుద్ధిస్నానానంతరమున జరిపించ నక్కఱలేదు.

## శ్రాద్ధసామాన్య విధివిచారము.

ఇవి కూరలు, ఇదిపచ్చడి, ఇవిభక్ష్యములు అని వస్తువులనుగుఱించిచెప్పి వడ్డించవలయునుగాని "ఇదిరుచిగానున్నది, ఇదిచాలమంచిది" అని పదార్థముల గుణముల వర్ణించి వడ్డించకూడదు, శ్రాద్ధమునకయి ప్రయత్నముచేసి సంపాదించిన వస్తువులలో భోక్త యాచించినవస్తువు నవశ్యము వడ్డించవలయును. పదార్థముల తీసికొనిరాక "కూరలు కావలయునా, పచ్చడికావలయునా?" అని అడుగగూడదు. పదార్థముల తెచ్చికావలయునా అని అడుగవలయును. వ్యంజనాదు లన్నింటిని పాత్రలతో తెచ్చి పాత్రలతో వడ్డించవలయునుగాని చేతితో వడ్డించకూడదు. అయఃపాత్రలతో శ్రాద్ధకాలమున వడ్డించకూడదు. శ్రాద్ధదివసమున పితృశేషము భుజింపవలయును గాని వైశ్వదేవశేషము భుజింపఁగూడదు. ఆదినమున శ్వానబలి వేయకూడదు. ఆబ్దికదినమునందును ఆదినమునకు పూర్వోత్తరదినములందును క్షౌరాభ్యంగనాదికములను విడువవలయును. ఈ దినములందు బ్రహ్మచర్యవ్రతమును పరిపాలింపవలయును. సామాన్యముగ శ్రాద్ధములందు దేవపిత్రర్చనసమయమున పుష్పధూపాదుల నుపయోగింపక అన్నింటికి "దళదానంబులకు తోటకూరకట్ట" యనులోకోక్తి ననుసరించి "పుష్పార్థా ఇమే అక్ష

తాః, ధూపార్ధా ఇమే అక్షతాః, పుష్పార్ధా ఇమే తిలాః, ధూపార్ధా ఇగే తిలాః" అని జరుపుచున్నారు. స్వల్పప్రయత్నమున లభించు పుష్పాదులకయి ప్రయత్నముచేయక తత్రప్రత్యామ్నాయ మక్షతల నుపయోగించుట దూష్యము. కొందఱు శ్రద్ధాళువులుసైతము ఉపేక్షాబుద్ధిగల కొందఱుపురోహితులు చెప్పెడి వచనములనమ్మి ఆబ్దికాదులయందు పుష్పాద్యుపచారము లనవసరములను తలంపు కలిగియుంటచే నిటులవ్రాసితిమి.

శ్రాద్ధమునకయిచేసి వడ్డించినవస్తువులలో తనకిష్టమయినవస్తువును భోక్తయడుగవచ్చును. కాని తనవిస్తరియందు వడ్డించనివస్తువుల నడుగఁగూడదు. అత్యధికముగ వడ్డించుకొనుటయుతప్పే. వడ్డింపవచ్చిన వస్తువులు తన కక్కరలేనియెడల "వద్దు" అని నోటితో చెప్పక చేతితో వద్దని సంజ్ఞచేయవలయును. కావలసియున్నను అట్లే సంజ్ఞచేయవలయును. చిత్రాహుతిబలులను పెట్టకూడదు. చేసినకూరగాయలు మొదలగునవి రుచిగా ఉన్నవా అని కర్తయడిగినను రుచిగా ఉన్నవి అని భోక్తపలుకగూడదు. భోక్త లొకరినొకరు తాఁకకుండునటుల కూర్చొని భుజింపవలయును ఒకవేళ పొరబాటుచేత దాఁకినేని ఆయన్నమును పరిత్యజింపక భుజించి తద్దోషపరిహారార్థము గాయత్రీజపము ౧౦౮ పర్యాయములు చేయవలయును. జలపానముచేయునపుడు సగముత్రాఁగి వానిని నిలువయుంచి అమిగిలినజలమును మఱల త్రాఁగఁగూడదు. పంచపాత్రయందు కావలసినంతజలమునే పోసికొని దానిని త్రాఁగి మఱల కావలసినప్పుడు పంచపాత్రయందు జలము నుంచుకొనవలయును. భక్ష్యములనయినను సగముకొఱికి తక్కినసగమును మఱల భుజింపకూడదు. వేడిగనున్నయెడల విసనకర్ర చేతవిసురుకొనవలయునుగాని నోటితో ఊదుకొనకూడదు. భోజనానంతరమున భోక్త దూరప్రయాణము చేయఁగూడదు. సాయంకాలమున ౧౦ పర్యాయములు గాయత్రీమంత్రముచేత జలపానముచేసి ౧౦౮ పర్యాయములు గాయత్రినిజపించి తరువాత మామూలుగ సంధ్యావందనాది నిత్యకర్మలను చేసికొనవలయును. ఆదినమున క్షౌరాభ్యంగములు చేసికొనగూడదు ద్వితీయపర్యాయము భుజించగూడదు. నిమంత్రణదినమునందును శ్రాద్ధదినమునందును బ్రహ్మచర్యనియమమును పరిపాలించవలయును.

ఆబ్దికదినమున ఘంటానాదము చేయకూడదు. దేవతార్చన సమయమునందయినను ఘంటానాదము చేయరాదు. శ్రాద్ధోద్దేశముగా తెచ్చినవస్తువులను పితరుల కివ్వనిది ఇతరులకు వినియోగించ వలనుపడదు. భోక్తలకు ఆపోశనము ఇచ్చుపర్యంతము ప్రథమమున విశ్వేదేవులకును తరువాత పితరులకును అర్చనాదికము సర్వము జరుపవలయును. హస్తోదక మిచ్చునప్పుడంతయు ప్రథమమున తాను హస్తోదకము గ్రహించి తరువాత భోక్తల కివ్వవలయును. పితరుల కర్చనము సలుపునప్పుడును పితృర్ఘ్యపాత్రలయందు

తిలాదుల నుంచునప్పుడును ఎడమమోకాలును భూమిపై నానించి చేయవలయును. భోక్తగా కూర్చున్న బ్రాహ్మణుఁడు తానుచెప్పవలసిన మంత్రములను వాక్యములనుమాత్రమే చెప్పవలయునుగాని ఇతరభోక్త చెప్పవలసినట్టియు కర్త చెప్పవలసినట్టియు మంత్రముల చెప్పకూడదు. కర్తకు మంత్రమురానియెడల వచ్చిన మఱొకవిప్రుని మంత్రము చెప్పుటకు పిలువవలయును. శ్రాద్ధదినమునం దైనను ప్రాతఃకాలమున శుచియై స్నానమొనర్చుకొని సంధ్యోపాసనాదుల చేసికొనవలయును. ఔపాసనాగ్ని అనుగతమగువేని (పోవుచేని) చతుస్పాత్ర ప్రయోగముచేసి అగ్నిని సంపాదించుకొని తరువాత ఔపాసనము చేసికొనవలయును. ఈ యౌపాసనాగ్నియందే అగ్నౌకరణము చేయవలయును. శ్రాద్ధపాకమునందు గోధుమలు, తిలలు, ఆవాలు ఇవి తప్పక చేరునట్లు ప్రయత్నించవలయును. శ్రాద్ధదినమున వైశ్వదేవమునకు ప్రత్యేకముగ వంటచేయించి వైశ్వదేవము చేసి దేవతానివేదనము చేయవలయును. ఆపస్తంబసూత్రులు ప్రత్యాబ్దికములందు ప్రత్యేకముగ విష్ణుస్థానమున నొకభోక్తను నిమంత్రించి అర్చింపరాదు. సాలగ్రామమును సమీపమునం దుంచుకొని శ్రాద్ధకర్మ సమాప్తిచేయవలయును. శ్రాద్ధశేషాన్నమును శూద్రాదులకు పెట్టకూడదు. విశ్వేదేవులకును పితరులకును పాదప్రక్షాళనము చేసినతావున ఒకరిపాద్యజలము మఱొకరిపాద్యజలమును తాఁకకుండునట్లు ప్రయత్నించవలయును.

## ప్రమాదపరిశోధనము.

ఆబ్దికమంత్రములు ప్రతిబ్రాహ్మణపురోహితునకు ఆవశ్యకమగుటచేత కొంచెమెచ్చుతక్కువగ బ్రాహ్మణపురోహితులందఱు చదివియున్నారు. రానురాను నేటికాలపుపురోహితులలో పలువురు సాహిత్యజ్ఞానము లేనివారుగనున్నారు. దానివలన నిందుకొన్ని విషయములు అన్వయరహితములుగ నున్నను వానినిగుఱించి విచారించుటలేదు. పాండిత్యముగలవారలకు వేదవిషయములందు ప్రవేశములేకపోవుట సామాన్యలక్షణముగ నేఁటికి పరిణమించినది.ఇందువలన ప్రయోగవాక్యములందు కొన్నివ్యత్యాసములు గనంబడుచున్నవి. శ్రుతులయందును సూత్రములందును ఈ వ్యత్యాసముండదు. ఒకవేళయున్నను వ్యాఖ్యాతలింతకుముందే మీమాంసజేసి సిద్ధాంతము జేసియుందురుగాన మనమా విషయమునుగూర్చి ప్రయాసపడ నక్కరలేదు.

౧. పరివేషణానంతరమున అన్నమును త్యక్తముచేయునప్పుడు "అన్నాదులను బ్రహ్మాదిస్వరూపమను నర్థముగ చెప్పుచు చివర **"గయేయంభూః, గదాధరో భూత్వా"** అని కొందఱు చెప్పుచున్నారు. దీనివలన ప్రక్రమభంగ మగుటయేగాక అర్థమయినను సరిగలేదు. ఆస్థలమున **"గదాధరోభోక్తా"** అని చెప్పవలయును. వైద్యనాథీయస్మృతి ముక్తాఫల శ్రాద్ధకాండమునందును ఇవ్విధంబుగ నున్నది.—

శ్లో. అన్నం బ్రహ్మాత్మకం ధ్యాత్వా ద్విజమాత్మాన మేవచ।
శ్రాద్ధభూమింగయాంధ్యాత్వా భోక్తారంచగదాధరం॥
ఉదీర్యగోత్రసంబంధ నామానిచ తతఃపరం।
ఇదమన్నం తతస్స్వాహా స్వధాశబ్దా యథోచితం॥
ఉదీర్యచనమశ్శబ్దం నమమేతి తతోవదేత్॥

అని చెప్పియున్నది.

ప్రయోగచంద్రికయందు.—

“దక్షిణహస్తేన యవసహిత ముదకమాదాయ....ఇయం భూర్గయా” అయంభోక్తా బ్రాహ్మణో గదాధరః.

అని చెప్పఁబడియున్నది.

ఇంతయేల “గదాధరో భూత్వా” అని చెప్పెడివారు సైతము ఆయాబ్దిక మంత్రములందు ఆపోశనము పట్టించుతావునందు “ఇయం భూర్గయా, ఏతే బ్రాహ్మణా గదాధరాః” అని రూపకముచేసి చెప్పుచున్నారు.

౨. నామములయొక్క చివర పురుషులకు శర్మయని చేర్చునట్లు స్త్రీలకు ఏపదము చేర్చవలసినదనువిషయమయి “అయుగ్దాంతం స్త్రీణాం” గోభిల.గృ.సూ.౨.౮.౧౬. వలన నామాంతమున “దా” శబ్దమును చేర్చవలయునని సిద్ధించుచున్నది. ప్రయోగ గ్రంథమగు ఆండపిల్లవృత్తియందు. “ఏతత్తేమాతః యజ్ఞదేయాశ్చత్వా మను ....యజ్ఞదా మిత్రజనిదా విష్ణుజనిదా........సర్వత్ర స్త్రీనామాన్తే దాశబ్దః ప్రయోక్తవ్యః” అని చెప్పఁబడియున్నది.

౩. ఆబ్దికాదులయందు పిండప్రదానము భోజనానంతరము చేయఁబడుచున్నది. దీనియందు పిండప్రదానార్థము క్రిందఁబఱుపఁబడు దర్భలు (సకృదాచ్ఛిన్నదర్భలు) పఱిచిన పిదప “పితః....గోత్ర....శర్మన్ వసురూప అవనిని క్త” ఈమాటలు చెప్పఁబడుచున్నవి. దీనిని అవనేజనమందురు. ఇందుకు మూలమగు పరాశరమాధవీయమున ఆచారకాండ ౩-వ అధ్యాయమున పిండప్రదానస్థలమున

తతోఽవనేజనం కుర్యాత్ తదాహ సుమన్తుః:—

శ్లో. అసావవనేనింక్ష్వేతి పురుషం పురుషం ప్రతి।
త్రిస్త్రిరేకేనహస్తేన విదధీతావనేజనం॥

అని చెప్పఁబడియున్నది. దీనివలన పితః....గోత్ర....శర్మన్ వసురూప అవనేనింక్ష్వ” అని చెప్పుట శుద్ధమనియు “పితః....అవనిని క్త” అనిచెప్పుట చింత్యమనియు తెలియవచ్చుచున్నది. ఈపదము ణిజర్=శౌచపోషణయోః, అను ధాతువు

వఱనపుట్టినది. ఇదిఉభయపది. ఇది లోటుయొక్క మధ్యమపురుషైకవచనమని తెలియవచ్చెడిని. అవనేనిక్త అనిన లోటుమధ్యమపురుష బహువచనమగును. కావున 'అవనినిక్త' అనుపదము ప్రామాదికమని తోఁచుచున్నది. అయినను ఈవిషయము చదువరుల ఎదుట ఉంచి పిదప గ్రాహ్యమయినచో చేర్పవచ్చునను తలంపుతో చర్చించి వదలితిమి. విద్వాంసు లిందులకు తగిన అభిప్రాయమునిచ్చెదరు గాక ఇదివరకున్న విధంబుగనే ఈ గ్రంథమునందు ముద్రించితిమి.

## వివిధవిషయములు.

శ్లో. శ్రాద్ధే విసర్జనా త్పూర్వం భోజయేన్న సువాసినీం।
తచ్ఛ్రాద్ధం విఫలం ప్రోక్తం శ్రాద్ధం కుర్యా త్పరేఽహని॥

స్మృతిసారే.

తా. శ్రాద్ధమునందు బ్రాహ్మణవిసర్జనమునకు ముందుగ సువాసినికిభోజనము పెట్టరాదు. అట్లు పెట్టునేని ఆశ్రాద్ధము నిష్ఫలమగును. మరల మఱునాడు ఆబ్దికము పెట్టవలయును. (ఈ వచనము సువాసిని మరణించినపుడు ఆబ్దికదినమున నొకసువాసినికి భోజనము పెట్టవలయునను అర్థముగల నొకవాక్యమునకు విషయవ్యవస్థచేయుచు భోక్తలతో పాటు పెట్టకూడదనియు బ్రాహ్మణవిసర్జనానంతరమున పెట్టవలయుననియు నియమమును తెలిపెడిని).

శ్లో. పితృన్ద్దేశ్యకృతం పాకం యో దేవేభ్యః ప్రయచ్ఛతి।
తద్దినేచోపవాసంచ శ్రాద్ధంకుర్యా త్పరేఽహని॥

స్మృతిసారే.

తా. పితరులకని చేసినపాకమును దేవతానివేదనమున కుపయోగించునేని ఆనాఁడుపవసించి మరల మఱునాడు శ్రాద్ధమును పెట్టవలయును.

శ్లో. శ్రాద్ధభోజనకాలేతు దీపో యది వినశ్యతి।
పునరన్నం నభోక్తవ్యం భుక్త్వా చాంద్రాయణం చరేత్॥

ఔశనసస్మృతి ౫ అధ్యాయే.

తా. భోక్తలు భుజించుచుండగా దీపముచల్లారునేని మరల ఆయన్నమును (దీపము ముట్టించుదనుక) భుజింపకూడదు. అట్లుగాక భుజించునేని చాంద్రాయణవ్రతము చేయవలయును.

నన క్తంగృహీతేనోదకేన శ్రాద్ధకర్మ కుర్యాత్॥ విష్ణుః.

తా. రాత్రియందు సంగ్రహించియుంచిన ఉదకముచేత శ్రాద్ధము చేయరాదు. రేపు శ్రాద్ధమనగా నేఁటిరాత్రి ప్రత్యేకముగ నుదకమునీసియుంచినను ఆయుదకముచేత శ్రాద్ధపాకము చేయకూడదని యర్థము.



శ్రాద్ధకృచ్ఛుక్లవాసాస్స్యాత్‌॥ ప్రచేతాః.

తా. శ్రాద్ధమును చేయునతఁడు తెల్లనివస్త్రములధరించి చేయవలయును.

శ్లో. కాషాయవాసాః కురుతే జపహోమప్రతిగ్రహాన్‌।
న త ద్దేవగమం భవతి హవ్యకవ్యేష్వథోహవిః॥

తా. కావిరంగు గలవస్త్రముధరించి జపహోమాదులను చేయునేని ఆచేసినకార్యము దేవతలనుపొందదు. హవ్యకవ్యములందును ఇదేవిధముగ గ్రహించునది.

శ్లో. నగ్నస్స్యా న్మలవద్వాసా నగ్నఃకౌపీన కేవలః।
ద్వికచ్ఛోఽను త్తరీయశ్చ అకచ్ఛోఽవస్త్ర ఏవచ॥
నగ్నఃకాషాయవాసాస్స్యా న్నగ్న శ్చార్ధ్రపటస్సృతః॥

తా. మలినవస్త్రుఁడు, కేవల కౌపీనము ధరించినవాఁడు, ఉత్తరీయములేనివాఁడు, కట్టుబట్టలేనివాఁడు, రెండుకచ్ఛలుగ వస్త్రము ధరించినవాఁడు, కచ్ఛలేక ధరించినవాఁడు, కావిరంగుగల గుడ్డగలవాఁడు, తడిగుడ్డగలవాఁడు వీరికి నగ్నులనిపేరు. అనఁగా దిగంబరుఁడై ఏకార్యము నెటుల చేయకూడదో పైనచెప్పినతీరుననుండియు నేనియు చేయకూడదని భావము.

శ్లో. భ్రాతౄన్వా భోజయేచ్ఛ్రాద్ధే పుత్రంవాఽపిబహుశ్రుతం।
ఆత్మానం వాఽపి భుఞ్జీత న విప్రం వేదవర్జితం॥

తా. శ్రాద్ధభోజనమునకు సోదరులనుగాని పండితుఁడగు పుత్రునిగాని నిమంత్రించవచ్చును. లేదాతానైనను అర్చనాదికమంతయునలిపి ఆయన్నమును భుజించవలయునుగాని వేదవిద్యావిహీనునకు నిమంత్రణముచేయవలదు అని వేదవిహీనుని నిందించుటకయి ఈవచనము చెప్పఁబడినది.

శ్లో. స్త్రీశేషం పితృశేషంచ శూద్రశేషం తథైవచ।
విధవా పుష్పిణీశేషం భుక్త్వా చాంద్రాయణంచరేత్‌॥

తా. స్త్రీశేషమును, పితృశేషమును, శూద్రశేషమును, వితంతుశేషమును, రజస్వలాశేషమును అయినయన్నమును భుజించినయెడల చాంద్రాయణవ్రతము సలుపవలయును.

శ్లో. పితృవ్యస్య గురోర్వాపి మాతులస్యమహాత్మనాం।
జ్యేష్ఠభ్రాతుశ్చ పుత్రస్య బ్రహ్మనిష్ఠస్య యోగినః।
ఏతేషాం శ్రాద్ధశేషంతు భుక్త్వాదోషోనవిద్యతే॥

తా. పితృవ్యుఁడు, (పినతండ్రిపెద్దతండ్రులు) గురువు, మేనమామ, మహాత్ములు, పెద్దఅన్నగారు, పుత్రుఁడు, బ్రహ్మనిష్ఠుఁడగుయోగి, వీరియాబ్దికములయందు పితృశేషమును భుజంచినయెడల దోషములేదు.

శ్లో. అచ్ఛిన్నాగ్రా హ్యశుష్కాగ్రా హ్రస్వాశ్చైవప్రమాణతః।
కుతపా ఇతి విజ్ఞేయాస్తైశ్శ్రాద్ధంతు సమాచరేత్॥ కాత్యాయనః.
ఉపమూలం లూనాః పితృకార్యేషు॥ గోభిలః.
ఉపమూలం తథాలూనాః శ్రాద్ధార్థంతు కుశాస్స్మృతాః।
తదలాభేచనీవారా దూర్వాశ్చసముదాహృతా॥

తా. కొనలుగలిగినవియు, ఎండని కొనలుగలవియు, హ్రస్వపరిమాణముగలవియు నగు దర్భలు కుతపము లనఁబడును. ఇట్టి దర్భలతో శ్రాద్ధమునొనర్పవలయును. పితృకార్యములందు మొదటివరకు ఛేదించినదర్భలు ప్రశస్తము. అవి దొరకనియెడల నెవరి గడ్డిగాని, దూర్వనుగాని ఉపయోగింపవలయును

శ్లో. అమాయాం మాసమాత్రంస్యాత్ ప్రోష్ఠపద్యాస్తు వత్సరం।
భానువారే త్వష్టరాత్రం నిత్యేద్వైనందినం స్మృతం॥
దర్భాశ్చ స్వయమానేయా దక్షిణా ప్రవణోద్భవాః।
తర్పణాద్యుచ్ఛ్రితాయేవై ఇత్యాద్యాశ్చవిసర్జయేత్॥
బృహత్పరాశరసంహితా.

తా. అమావాస్యయందు తెచ్చినదర్భలు ఒకమాసపర్యంతము ప్రశస్తము. భాద్రపదశుద్ధ పూర్ణిమయందు తెచ్చినదర్భలు సంవత్సర పర్యంతముపయోగింపవచ్చును. ఆదివారమునాఁడు తెచ్చినదర్భలు ౮ దినముల పర్యంతము ప్రశస్తము. సాధారణదినంబులఁదు తెచ్చినవి యొకనాఁటికి మాత్రము ప్రశస్యము.

శ్లో. కుశాభావేకుశస్థానే కాశదూర్వాశ్చ నదాయత్॥

తా. దర్భలు లభింపనియెడల దర్భలకు ప్రత్యామ్నాయముగ రెల్లుగాని దూర్వనుగాని గ్రహింపవలయును.

శ్లో. ఉభాభ్యామపి హస్తాభ్యాం ద్విజైర్దర్భపవిత్రకే।
ధారణీయే ప్రయత్నేన బ్రహ్మగ్రన్థిసమన్వితే॥ అత్రిః.

తా. బ్రాహ్మణులు దర్భపవిత్రములను తమహస్తద్వయమునందు ధరింపవలయును.

శ్లో. కూర్చేనవా పవిత్రేణ యేనకర్మాణికారయేత్।
తస్యగ్రంథిం విసృజ్యైవ కర్మాంతేతు తతస్త్యజేత్॥
పవిత్రకూర్చయోస్త్యాగే సగ్రంథ్యోస్తు ప్రమాదతః।
ఉపవాసం చరేదేక ముపవాసద్వయంతువా॥
స్మృతిముక్తాఫలే ఆహ్నికకాండే భరద్వాజః.

తా. కర్మయందుపయోగించిన కూర్చనుగాని పవిత్రమునుగాని కర్మాంతమునం దుముడివిప్పి పారవేయవలయును. ముడివిప్పక కూర్చనుగాని పవిత్రమునుగాని వదలిరేని ఒకనాఁడుగాని రెండుదినములుగాని ఉపవాసము చేయవలయును.

## ఆశౌచాంతరిత శ్రాద్ధవిషయము.

### నిర్ణయసింధు. ౩౩౮-౩౩౯ పుటలు.

జననమరణాశౌచములలో ఒకటివచ్చియుండగా శ్రాద్ధదినమువచ్చినయెడల ఆ యాశౌచములశుద్ధి యేనాడగునో నాడుశ్రాద్ధమును ఆచరింపవలయును.

శ్రాద్ధమును ప్రారంభించిచేయునప్పుడు ఆశౌచముసంభవించినయెడల శ్రాద్ధము సమాప్తియగు నంతవరకు ఆశౌచములేదు. శ్రాద్ధప్రారంభమనగా శ్రాద్ధదినమునందు సంకల్పించి "పితృపితామహ ప్రపితామహానాం...గోత్రాణాం...శర్మణాం వసురుద్రాదిత్యరూపాణాం స్థానే ఆవాహనీయార్థే భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః" అని చెప్పెడి ద్వితీయవరణమని కొందఱిమతము. శ్రాద్ధభోక్తృబ్రాహ్మణ భోజనార్థము పాకమును ప్రారంభించుటయే శ్రాద్ధప్రారంభమని కొందఱిమతము.

### ప్రమాణవచనములు.

ఆశౌచమధ్యే శ్రాద్ధదినప్రాప్తౌతు మాధవీయే కాలాదర్శేచ ఋష్యశృఙ్గః:—దేయే పిత్ర్యాణాం శ్రాద్ధేతు ఆశౌచం జాయతేయదా। ఆశౌచేతువ్యతిక్రాన్తే తేభ్యశ్శ్రాద్ధం ప్రదీయతే॥

వైద్యనాథీయేచ॥ ఋష్యశృఙ్గః॥ శ్లో॥ శుచీభూతేన దాతవ్యం యాతిథిః ప్రతిపద్యతే। సాతిథిస్తత్రకర్తవ్యా నత్వన్యావైకదాచన॥ శుచినాతావచ్ఛ్రాద్ధంకర్తవ్యం, తత్రముఖ్యకాలే కర్తుశ్శుద్ధ్యభావే శుద్ధ్యనంతరం యాతిథిః ప్రతిపద్యతే - లభ్యతే సాగ్రాహ్యా, ఆశౌచదుష్టాతు నగ్రాహ్యేత్యర్థః॥

ప్రసంగాచ్ఛ్రాద్ధోపక్రమానంతర మాగతాశౌచవిషయం కించిదుక్తం తద్యథా:—

శ్లో॥ వర్షశ్రాద్ధేతుసంప్రాప్తే పిత్రోరాశౌచసంభవే । తదానీమశుచిర్నస్యాత్కుర్యాచ్ఛ్రాద్ధంమృతేఽహని ॥ నిమంత్రితేషు విప్రేషు ప్రారబ్ధే శ్రాద్ధకర్మణి। గేహే పితృషు తిష్ఠత్సు నాశౌచం విద్యతే క్వచిత్॥ ఇతి ఛాగలేయవచనాత్.

శ్రాద్ధోపక్రమశ్చ, కుతపకాలే ద్వితీయవరణం యద్వా, శ్రాద్ధేపాకపరిక్రియా, తదప్యుక్తంవిష్ణునా, శ్లో॥ వ్రతయజ్ఞవివాహేషు శ్రాద్ధే హోమేఽర్చనే జపే ॥ ఆరబ్ధే సూతకం నస్యా దనారబ్ధేతు సూతకం॥ శ్రాద్ధే ప్రారంభ స్తేనై వో క్తః, ప్రారంభోవరణంయజ్ఞే సంకల్పో వ్రతసత్రయోః। నాందీముఖం వివాహాదౌ శ్రాద్ధే పాకపరిక్రియా॥ గ్రంథాంతరే:— నిమంత్రణో త్తరంశ్రాద్ధే ప్రారంభఃస్యా దితి స్మృతిః.

## మలమాసాగత వార్షిక శ్రాద్ధవిషయము.

అధికమాసమువచ్చినప్పుడు అధికమాసమునందును, నిజమాసమునందును, ప్రత్యాబ్దికశ్రాద్ధముల నాచరింపవలయును. అధికమాసమునందు చేయునట్టి ప్రత్యాబ్దికశ్రాద్ధమును, పిండహీనముగను, నిజమాసమునందు పెట్టెడిశ్రాద్ధమును పిండయుతముగను చేయవలయును.

అధికమాసమునందు మరణించినవారికి ప్రతివర్షము అమాసమునందు శ్రాద్ధమును పెట్టవలయును. కాని ఆయధికమాసము వచ్చినసంవత్సరమునందు మాత్రము అధికమాసమునందు మాత్రమే పిండయుక్తముగ శ్రాద్ధమును పెట్టవలయును. నిజమాసమునందు పెట్టనక్కరలేదు. నిజమాసమునందు మరణించినవారికిన్ని ప్రతివర్షము ఆమాసమునందు శ్రాద్ధమును పెట్టుచు అధికమాసము వచ్చినసంవత్సరమునందుమాత్రము నిజమాసమునందు మాత్రమే పిండయుతముగ శ్రాద్ధము పెట్టవలయును.

• గతించినసంవత్సరములోపల ఆయామాసములందు పెట్టెడి ఆనుమాసికశ్రాద్ధములను మాత్రము రెండుమాసములందును పిండసమన్వితములుగనే పెట్టవలయును.

## ప్రమాణవచనములు.

సుధీవిలోచనే గౌతమః:— ద్వౌమాసా వేకనామానా వేకస్మి న్వత్సరేయది। తత్రాద్యే దైవకార్యాణి పితృకార్యాణిచోభయోః॥

వ్యాసోఽపి:—షష్టిభిర్దివసైర్మాసః కథ్యతే బాదరాయణైః। పూర్వార్ధంతుపరిత్యాజ్య ముత్తరార్ధంప్రశస్యతే॥

అన్యత్ర. ఉత్తరే దేవకార్యాణి పితృకార్యాణి చోభయోః, ఇతిస్మరణాత్, షష్టిదివసాత్మకేమాసే భాగద్వయంప్రకల్ప్య పూర్వమసంక్రాంతిసంజ్ఞికం. ఉత్తరం సూర్యసంక్రాంతి సహిత మితివివేకః॥ "పితృకార్యాణిచోభయోః" ఇతి గౌతమవచనేన మలమాసే శుద్ధమా

సేచ వార్షికశ్రాద్ధాచరణం విహితమితి ప్రతీయతే, ఏతదనుసారేణ శిష్టానామాచరణమ ప్యవ్యాహతం ప్రచలతి.

అత్రకించిద్విశేషముక్తం శ్రాద్ధచిన్తామణౌ:—

శ్లో. సంక్రాంతేపిండసంయుక్త మసంక్రాంతేత్వపిండకం, మాస ద్వయేఽపికర్తవ్యం శ్రాద్ధంవా పితృతృప్తయే॥ ఇతివచనాత్. అపార్వణం శ్రాద్ధం మలమాసే, సపార్వణం శ్రాద్ధం శుద్ధమాసే కర్తవ్యమితివివేకః.

మలమాసమృతానాం యదాకదావా.పునఃసఏవమాసః అధిక మాస ఆగతశ్చే త్తస్మిన్మలమాస్యేవ వార్షికశ్రాద్ధంకార్యం, నతుశు ద్ధమాసేఽపి.

ఏతత్కాదాచిత్కం, అత్రభృగుః:—మలమాసమృతానాంతు యచ్ఛ్రాద్ధం ప్రతివత్సరం । మలమాసేతు తత్కార్యం నాన్యేషాంతు కథంచన॥ అన్యేషాంశుద్ధమాసమృతానాం మలమాసేనకార్యం,కింతు శుద్ధమాసఏవకార్యమిత్యర్థః.

సత్యవ్రతపార్శ్వ.శ్లో. వర్షేవర్షేతు యచ్ఛ్రాద్ధం మృతాహేతన్మలి మ్లుచే। కుర్యాదత్రప్రమీతానా మన్యేషాముత్తరత్రతు॥ అత్రప్రమీ తానామిత్యుక్తే, మలమాసేశుద్ధమాసమృతశ్రాద్ధనిషేధః, మలమాస మృతస్య శుద్ధమాసే శ్రాద్ధనివర్తకః, తుశబ్దః.

సుధీవిలోచనకారుని అభిప్రాయము.

అధికమాసశ్రాద్ధవిషయమై కించిద్భేదముగనున్నది. అది ఆంధ్ర దేశశిష్టాచారమునకు విరుద్ధము.

మలమాసమృతానాం యదాకదావా సఏవమృతమాస ఆగ తశ్చేత్తస్మిన్నేవశ్రాద్ధంకార్యం నతుశుద్ధే, శుద్ధమాసమృతానాం శుద్ధ మాసఏవ॥

యుగాదికంశ్రాద్ధపంచకం. మాసద్వయే, శుద్ధేమలేచకార్యం, (యుగ, మను, అపరపక్షిక, మాసిక, త్రైర్థికం,)

శ్రాద్ధాంగతర్పణము.

శ్రాద్ధాంగతర్పణమును కొన్నిశ్రాద్ధములయందు శ్రాద్ధము ఆచరించి మరుసటి దినము ప్రాతఃకాలమునందు చేయవలయుననియు, మఱికొన్నిటియందు ఆదివసమునందే

శ్రాద్ధము ఆచరించి బ్రాహ్మణవిసర్జనానంతరము ఆచరించవలయుననియు శాస్త్రప్రమాణముగలదు. "పరేఽహనికర్తవ్యం" అని మరుసటిదినమునందు చేయుదానికిన్ని "సద్యస్తిలతర్పణం" అని శ్రాద్ధానంతరమునందే ఆచరించుదానికిని పేరు.

శ్రాద్ధానంతరమే అంగభూతతిలతర్పణము ఆచరించు శ్రాద్ధములేవియనగా:— ౧. పక్షశ్రాద్ధము. ౨. హిరణ్యశ్రాద్ధము. ౩. అష్టకాశ్రాద్ధము. ౪. అనుమాసికశ్రాద్ధము. ౫. సంవత్సరవిమోకశ్రాద్ధము. ౬. సపిండీకరణశ్రాద్ధము. ౭. కారుణ్యశ్రాద్ధము. ౮. జీవపితృకకర్తృక మాతృశ్రాద్ధము.

౨. శ్రాద్ధముసలిపి మఱుసటిదినము ప్రాతఃకాలమునందు శ్రాద్ధాంగతర్పణము చేయఁదగిన శ్రాద్ధము లేవియనగా:—౧. తీర్థశ్రాద్ధము. ౨. గయాశ్రాద్ధము. ౩. ప్రత్యాబ్దికశ్రాద్ధము. ౪. సకృన్మహాలయశ్రాద్ధము.

పక్షశ్రాద్ధము. సకృన్మహాలయశ్రాద్ధము, అనిమహాలయశ్రాద్ధముద్వివిధము. పితృపక్షమగు భాద్రపదకృష్ణమునందు ప్రత్యహము శ్రాద్ధమును ఆచరించవలయును. ఇదిపక్షశ్రాద్ధముఅనియును, పదిహైదుదినములలో ఒకదినమునందు ఆచరించుదానిని సకృన్మహాలయశ్రాద్ధముఅనియుచెప్పుదురు. ముఖ్యము పక్షశ్రాద్ధము, గౌణము, సకృన్మహాలయశ్రాద్ధము.

## ప్రమాణవచనములు.

ప్రయోగ పారిజాతాది నిబంధన గ్రంథములయందు ప్రమాణవచనము లనేకములుగలవు. సంగ్రహముగ కొన్నిటినిమాత్రము ఉదాహరించుచున్నారము.

శ్లో. పక్షశ్రాద్ధే హిరణ్యేచ పశ్చాద్దద్యా త్తిలోదకం।
తథాచైవాష్టకాశ్రాద్ధే శ్రాద్ధేచైవానుమాసికే॥
తీర్థశ్రాద్ధే గయాశ్రాద్ధే శ్రాద్ధే ప్రత్యాబ్దికేఽపిచ।
పరేఽహని ద్విజః కుర్యా త్తర్పణం తిలసంయుతం॥
పక్షశ్రాద్ధంతు నిర్వర్త్య తర్పణం తదనంతరం।
సకృన్మహాలయే శ్రాద్ధే పరేఽహనితిలోదకం॥

శ్రాద్ధమునకు పూర్వమునందే శ్రాద్ధాంగభూతమగు తర్పణమునుఆచరించి పిదప శ్రాద్ధమును ఆచరించవలసినశ్రాద్ధములు,

శ్లో. దర్శే పాతేచ సంక్రాంతౌ యుగమన్వంతరాదిషు।
తర్పయిత్వా పితౄన్ పశ్చా చ్ఛ్రాద్ధంకుర్యా త్ప్రయత్నతః॥

దర్శశ్రాద్ధము, వ్యతీపాతశ్రాద్ధము, సంక్రాంతులు ౧౨, యుగాదులు ౪, మన్వాదులు ౧౪, వీనియందు తర్పణంబనుపేరుగల పితృయజ్ఞమునుచేసిపిదప దర్శాదిశ్రాద్ధముల నొనర్చవలయును.

కర్తా, ఉపవీతీ:—

పితృ, పితామహ, ప్రపితామహాః ! మయా ఆచరితం శ్రాద్ధం "అక్షయ్యమస్తు" ఇతిబ్రూత; బ్రాహ్మణహస్తే జలందద్యాత్ ॥

(అని పితృబ్రాహ్మణుని చేతియందు జలమును విడువవలయును.)

పితృ బ్రాహ్మణ:—అస్త్వక్షయ్యం ॥ (అని ప్రతివచనమిచ్చును.)

కర్తా, ఉపవీతీ:—పురూరవార్ద్రవసంజ్ఞకా విశ్వేదేవాః ! మయా ఆచరితం శ్రాద్ధం "అక్షయ్యమస్తు" ఇతిబ్రూత ॥

(అని విశ్వేదేవబ్రాహ్మణుని హస్తమునందు జలమునుంచుము.)

విశ్వేదేవ బ్రాహ్మణః:—అస్త్వక్షయ్యం॥ (అని ప్రతివచనమిచ్చును.)

కర్తా, ఉపవీతీ:—ఉపవిష్టేభ్యో బ్రాహ్మణేభ్యః దక్షిణాఃపాంతు ॥

(అని భోక్తృబ్రాహ్మణులిద్దఱకు దక్షిణ నిచ్చును.)

విశ్వే,పితృ, బ్రాహ్మణా:—పాంతుదక్షిణాః॥అనిప్రతివచన మిత్తురు.)

కర్తా, ఉపవీతీ:—

౧౧౯. ఋచేత్వా రుచేత్వా సమిత్స్రవంతి సరితో న ధేనాః । అంతర్హృదా మనసా పూయమానాః । ఘృతస్య ధారా అభి చాకశీమి । హిరణ్యయో వేతసో మధ్య ఆసాం । తస్మిన్త్సుపర్ణో మధుకృత్కులాయీ భజన్నాస్తే మధు దేవతాభ్యః । తస్యాసతే హరయ స్సప్త తీరే । స్వధాం దుహానా అమృతస్య ధారాం॥

(ఇతికూర్చం విసృజ్య) (అని కూర్చమువిప్పి)

కర్తా, ప్రాచీనావీతీ:—పితృ, పితామహ, ప్రపితామహేభ్యః... ...గోత్రేభ్యః......శర్మభ్యః వసురుద్రాదిత్య రూపేభ్యః స్వధోచ్యతాం॥

(ఇతిభూమౌజలంసించేత్ )

(కూర్చ విప్పిన దర్భలనుండి భూమియందు జలము నుంచవలయును.)

పితృబ్రాహ్మణాః:—అస్తుస్వధా॥ (అని ప్రతివచనమిచ్చును.)

కర్తా, ఉపవీతీ:—

పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాశ్చ ప్రియంతాం ॥

(అని ఆపర్కులమీదనే జలమునుంచి వానిని యుత్తరాగ్రములుగ పడవేయవలయును.)

విశ్వేదేవబ్రాహ్మణాః:—ప్రియంతాం విశ్వేదేవాః॥

(అని ప్రతివచన మిచ్చును.)

కర్తా, ఉపవీతీ:—

౧౨౦. ఆమావాజస్య ప్రసవో జగమ్యా ద్రాద్యావాపృథివీ విశ్వశంభూః।
ఆమాగంతాం పితరా మాతరా చా మా సోమో అమృ
తత్వాయ గమ్యాత్ ॥

ఇతి పవిత్రం విస్రస్య (అని పవిత్రమును విప్పి)

| కర్తా, | భోక్తృబ్రాహ్మణాః |
|---|---|
| దాతారోనోఽభి వర్ధంతాం | దాతారోవోఽభివర్ధంతాం |
| వేదా స్సంతతి రేవనః | వేదా స్సంతతి రేవవః |
| శ్రద్ధాచనోమావ్యగమత్ | శ్రద్ధాచవోమావ్యగమత్ |
| బహుదేయంచనోఽస్తు | బహుదేయంచవోఽస్తు |
| అన్నంచనోబహుభవేత్ | అన్నంచవోబహుభవేత్ |
| అతిథీగ్ంశ్చలభేమహి | అతిథీగ్ంశ్చలభధ్వం |
| యాచితారశ్చనస్సంతు | యాచితారశ్చవస్సంతు |
| మాచయాచిష్మకంచన | మాచయాచిఢ్వం కంచన |

కర్తా, ఉపవీతీ:—అన్న శేషః కిం క్రియతాం? (అని ప్రశ్న చేయును)

విశ్వే, పితృబ్రాహ్మణాః:—"ఇష్టైస్సహ భుజ్యతాం"॥

(అని ప్రతివచన మిత్తురు.)

కర్తా, ఉపవీతీ:—

౧౨౧. శ్లో॥ అద్యమే సఫలం జన్మ భవత్పాదాభివందనాత్।
అద్యమే వంశజా స్సర్వే యాతా వోఽను గ్రహాద్దివం॥౧॥

శ్లో॥ పత్రశాకాదిదానేన క్లేశితా యూయ మీదృశాః।
తత్క్లేశజాతం చిత్తేషు విస్మృత్య క్షంతు మర్హథ॥ ౨॥

౧౨౨. స్వాద్దుషఙ్గ్ం సదః పితరో వయోధాః కృచ్ఛ్రేశ్రిత శ్శక్తీవంతో గభీరాః। చిత్రసేనా ఇషుబలా అమృధ్రా స్సతోవీరా ఉరవో వ్రాతసాహాః। బ్రాహ్మణాసః పితర స్సోమ్యాసశ్శివేనో ద్యావాపృథివీ అనేహసా। పూషానః పాతు దురితా దృతా వృధో రక్షా మాకిర్నో అఘశఙ్గ్ంస ఈశత॥

విశ్వేదేవ, పితృబ్రాహ్మణాః:—

౧౨౩. ఇహైవ స్తం మావియోష్టం విశ్వ మాయు ర్వ్యశ్నుతం। క్రీడంతౌ పుత్రై ర్నప్తృభి ర్మోదమానౌ స్వేగృహే॥
సర్వస్యాప్త్యై సర్వస్యజిత్యై సర్వమేవ తేనాఽప్నోతి సర్వంజయతి॥

౧౨౪. శతమానం భవతి శతాయుః పురుష శ్శతేంద్రియ ఆయుష్యే వేంద్రియే ప్రతితిష్ఠతి॥

౧౨౫. శ్లో॥ ఆయుః ప్రజాం ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖానిచ।
ప్రయచ్ఛంతు తథా రాజ్యం ప్రీత్యా నృణాం పితామహాః।

*ఉత్తానం పాత్రముద్ధృత్య (బోర్లించినపాత్రను పరిగత్రిప్పి)

కర్తా, ఉపవీతీ:—

౧౨౬. † వాజేవాజేఽవత వాజినోనో ధనేషు విప్రా అమృతా ఋతజ్ఞాః। అస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాత పథిభి ర్దేవయానైః॥

౧౨౭. ఉత్తిష్ఠత పితరః ప్రేతశూరా యమస్య పంథా మనపేతా పు

* పిత్రర్చనాంతమున పితృబ్రాహ్మణ సమీపమున బోర్లించివడి.
† ఈమంత్రము దర్భపాణియై పఠించుట సంప్రదాయము.

ర్ణాణం । ధత్తా దస్మాసు ద్రవిణం యచ్చభద్రం ప్రణో బ్రూతా ద్భాగ ధాం దేవతాసు।

కర్తా, ప్రాచీనావీతీ:—పితృ పితామహ ప్రపితామహాః;ఉ తిష్ఠంతు॥
(అని పితృభోక్తృబ్రాహ్మణులకు దర్భల నిచ్చును.)

కర్తా, ఉపవీతీ:—అమూ త్తిష్ఠంతు విశ్వేదేవాః ॥
(అని విశ్వేదేవభోక్తృబ్రాహ్మణునకు దర్భల నిచ్చును.)

కర్తా, ఉపవీతీ:—ఆసీమాంతమనువ్రజే॥ (అని పలుకును.)

భోక్తారః:—అనువ్రజ॥ (అని ప్రతివచన మిత్తురు.)

౧౨౮. కయానశ్చిత్ర ఆభువ దూతీ సదావృధ స్సఖా। కయా శచిష్ఠయా వృతా ॥

౧౨౯. వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమ శ్శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమ స్సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః ॥

౧౩౦. అష్టావష్టా వన్యేషు ధిష్ణియేషూపదధా త్యష్టాశఫాః పశవః పశూ నేవావరుంధే షణ్మార్జాలీయే షడ్వా ఋతవ ఋతవః ఖలు వై దేవాః పితర ఋతూ నేవ దేవాన్ పితౄన్ ప్రీణాతి ॥

అస్య గృహే శ్రీమహాలక్ష్మ్యాః స్థైర్య సిద్ధిరస్తు ॥

అస్యయజమానస్య స్వధర్మానుష్ఠానాభిరతిసిద్ధిరస్తు ॥

ఆచంద్రార్కం వంశాభివృద్ధి రస్తు ॥

ప్రత్యాబ్దిక ప్రయోగ స్సమాప్తః.



౭౯-౮౦

# శ్రాద్ధాంగతర్పణమ్.

---

కర్తా, ఉపవీతీ:—

ఆచమ్య — స్వయముగ నాచమన మొనర్చి

ప్రాణానాయమ్య — ప్రాణాయామము చేసి,

ఏవంగుణవిశేషణవిశిష్టాయాం పుణ్యతిథౌ. శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం పితుః ప్రతిసాంవత్సరిక మృతాహోఖ్యాన్న శ్రాద్ధే పరేఽహని కర్తవ్య శ్రాద్ధాఙ్గ తర్పణం సద్యః తిలైః కరిష్యే.

ఇతిసంకల్ప్య — (అని సంకల్పించి.)

కర్తా, ప్రాచీనావీతీ:—

౧పితరం ... గోత్ర..శర్మాణం వసురూపం స్వధానమస్తర్పయామి 3॥

౨పితామహం..గోత్రం..శర్మాణంరుద్రరూపం స్వధానమస్తర్పయామి 3

3 ప్రపితామహం..గోత్రం..శర్మాణంఆదిత్యరూపంస్వధానమస్తర్పయామి

ఇతి త్రివారం తర్పయిత్వా — (అని మమ్మారు తర్పణమొనర్చి)

౧౩౧. శ్లో॥ యేకేచాస్మత్కులేజాతా అపుత్రాగోత్రిణో మృతాః।
తేగృహ్ణంతుమయాదత్తం సూత్రనిష్పీడనోదకం॥ *

☞ ఈతర్పణమునుగూర్చిన వివరమును పీఠికయందు చూడనలయును.

శ్రాద్ధాంగతర్పణం సమాప్తమ్.

---

* ఈశ్లోకము చెప్పి యజ్ఞోపవీతపు బ్రహ్మముడిని తడిపి కనులు తుడుచుకొని పిదప పాదప్రక్షాళనము చేసికొనుట సంప్రదాయముగ నున్నది. దీనిని గురించిన వివరము సైతము పీఠికయందు సావధానముగ చూడవలయును.

# లఘుపునస్సంధానమ్

(ప్రాయశ్చిత్తోపాసనమ్)

ఆచమ్య — ఆచమనము చేసి

ప్రాణానాయమ్య — ప్రాణాయామము చేసి

దేశకాలౌ సంకీర్త్య — దేశకాల సంకీర్తన మొనర్చి

అనుగతస్యాగ్నేః పునస్సంధానాఖ్యం కర్మకరిష్యే :—

శ్వేతతణ్డులచూర్ణేన ప్రాదేశమాత్రం స్థణ్డిలం చతురశ్రమణ్డలం కల్పయిత్వా, ద్వాభ్యాం దర్భాభ్యా ముల్లిఖ్య:—

తెల్లబియ్యపు పిండితో ప్రాదేశమాత్రమగు చతురశ్రమణ్డలము నొకదాని నేర్పతిచి, రెండు దర్భలచేత నీక్రింది విధముగ నందు గీయవలయును.

౧. శ్లో॥ * పాచీః పూర్వ ముదక్సంస్థం దక్షిణారభ్య మాలిఖేత్।
అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారభ్య మాలిఖేత్॥ ౧

శ్లో॥ †అవాక్యాగ్రోఽభ్యుక్ష్య, నిధాయ వహ్ని
ముత్సిచ్యతేఽపోఽక్షిణతోఽయ శేషం।
ప్రాక్తోయ మస్య న్నిదధాత్యుదగ్వా
యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్॥ ౨

"భూర్భువస్సువరోం" అగ్నిమిధ్వా | (అగ్నిని ప్రజ్వలింపజేసి)

ధ్యానం:—

౨. చత్వారిశృఙ్గా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య। త్రిధాబద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ॥

---

* తా॥ మొట్టమొదట ప్రాగ్రేఖలు రెండుదర్భలతో మూడుసారులు గీయవలయును. ఆ గీయునపుడు దక్షిణమున నారంభించి ఉత్తరమున సమాప్తినొందించవలయును. పిదప నుత్తరదిగ్రేఖలు 3 గీయవలయును. వానిని పశ్చిమమున నారంభించి తూర్పున సమాప్తి చేయవలయును.—౧.

† తా॥ అధోహస్తుడై ఆ స్థండిలముపైన అభ్యుక్షణముచేసి, అచట అగ్నినుంచి అభ్యుక్షణము చేయగా మిగిలినజలమును పైకి ఎగజల్లి వేయబోవు పరిస్తరణములకు వెలుపల నుండునటుల జలపాత్రము నొకదాని తూర్పునగాని యుత్తరమునగాని ఉంచవలయును

శ్లో॥ సప్తహస్త శ్చతుశ్శృఙ్గ స్సప్తజిహ్వో ద్విశీర్షకః।
త్రిపాత్ప్రసన్నవదన స్సుఖాసీన శ్శుచిస్మితః॥ ౧

శ్లో॥ స్వాహాం తు దక్షిణే పార్శ్వే దేవీం వామే స్వధాం తథా।
బిభ్ర ద్దక్షిణహస్తై స్తు శక్తి మన్నం స్రుచం స్రువమ్॥ ౨

శ్లో॥ తోమరం వ్యజనం వామై ర్ఘృతపాత్రం తుధారయన్।
మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్॥ ౩

శ్లో॥ ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చి స్సర్వకామదం।
ఆత్మాభిముఖ మాసీన మేవం ధ్యాయే ద్ధుతాశనమ్॥ ౪

(అని అగ్నిహోత్రుని ధ్యానించి)

సమ్ముఖీకరణమ్:—

౩. * ఏష హి దేవః ప్రదిశో ను సర్వాః పూర్వో హి జాత స్స ఉ గర్భే అన్తః। స విజాయమాన స్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖః॥

(ఈ మంత్రముచే జలమును అక్షతలను గ్రహించి యగ్నికిం దూర్పున జలమును బడమట నక్షతలను విడువవలయును)

ప్రాఙ్ముఖాగ్నే ! మమ అభిముఖోభవ, సుముఖోభవ. సుప్రసన్నోభవ, వరదోభవ, యథోక్త జిహ్వయా హవిర్గృహాణ॥

(అనుచు నగ్నిని సమ్ముఖునిజేసికొని.)

అగ్ని పరిసమూహనమ్:—

౪. ఓం భూ ర్భువ స్సువః, త త్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥

సోదకేన పాణినా ప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్య — అని పఠించుచు ప్రదక్షిణముగా నుదకపాణియై నగ్నికి చుట్టును తుడిచి.

## అలఙ్కరణమ్:—

| | |
|---|---|
| అలఙ్కృత్య:— | పుష్పాక్షతలతో ఈదిగువవిధమున అగ్నికి చుట్టును ౮ దిక్కుల నలంకరించవలయును, |
| అగ్నయేనమః | అని తూర్పునను |
| హుతవహాయనమః | అని ఆగ్నేయమునను |
| హుతాశనేనమః | అని దక్షిణమునను |
| కృష్ణవర్త్మనేనమః | అని నైరృతిదిక్కునను |
| దేవముఖాయనమః | అని పశ్చిమమునను |
| సప్తజిహ్వాయనమః | అని వాయవ్యమునను |
| వైశ్వానరాయనమః | అని యుత్తరమునను |
| జాతవేదసేనమః | అని ఈశానదిశను అలంకరింపవలయును |
| ప్రాగగ్రైర్దర్భైరగ్నిం పరిస్తృణాతి; ప్రాగుదగగ్రైర్వా | అగ్నికి చుట్టును ప్రాగగ్రములుగా నేని, యుత్తరాగ్రములుగా నేని దర్భల పరచవలయును. |
| దక్షిణానుత్తరాన్కరోతి | దక్షిణమువనుండునవి పైనుండునట్లుంచవలయును. |
| ఉత్తరానధరాన్ | ఉత్తరమున నుండు నవి క్రిందనుండునట్లుంచవలయును. |
| ఉత్తరేణాగ్నిం దర్భాన్ సంస్తీర్య | అగ్నికుత్తరమున దర్భలనుపరచి, |
| ద్వన్ద్వం న్యఞ్చి పాత్రాణి ప్రయునక్తి దేవసంయుక్తాని | (ఆదర్భలమీద) రెండేసిపాత్రలను జంటగా బోర్లించి ఉంచవలయును. |
| దర్వీం[1], ఆజ్యస్థాలీం[2], ప్రోక్షణీం[3], ఇతరదర్వీం[4] ఇతి. | ఆపాత్రలు ఏవియన స్రుక్కు. ఆజ్యపాత్ర, ప్రోక్షణీపాత్ర, స్రువము అని నాలుగు. |
| అప్రచ్ఛిన్నాగ్రౌ అనన్తర్గర్భౌ దర్భౌ ప్రాదేశమాత్రే పవిత్రే కురుతే | విరుగనికొనలుగలిగి లోపలగర్భము లేని రెండుదర్భలచేతలొాడితెడు కొలతగల రెండు పవిత్రములను జేయవలయును. |

| | |
|---|---|
| తృణం కాష్ఠం వాఽంతర్ధాయ, ఛినత్తి | (అపవిత్రములనుచేసి) ఆదర్భశేషమును తృణముగాని కట్టెగాని అడ్డముగానుంచుకొని ఛేదింపవలయును. |
| ననఖేన | గోటిచేత ఛేదింపకూడదు |
| అప ఉపస్పృశ్య | నీటినితాకి |
| అద్భిరనుమృజ్య | ఆపవిత్రములను నీటిచేతదుడిచి |
| ప్రోక్షణ్యామవధాయ | ప్రోక్షణీపాత్రయందుంచి |
| ప్రోక్ష్య | (నీటిచేత) ప్రోక్షించి |
| తస్యామప ఆనీయ | ఆపాత్రయందుదకమును పోసి |
| హస్తయో రంగుష్ఠోపకనిష్ఠికాభ్యా ముదగగ్రే గృహీత్వా | బొటన వ్రేలితోను చిటికిన వ్రేలికి ప్రక్కనుండు వ్రేలితోను ఉత్తరపు కొనలుగలపవిత్రములను (చేతికి) తీసికొని. |
| ప్రాచీస్త్రిరుత్పూయాభిమంత్ర్య | ఉత్పవనమనగా ప్రాగ్దిశయందారంభించి పడమటదిక్కునకుతీసుకవెళ్లి మరల ప్రాగ్దిశయందు సమాప్తిచేయుట ఉత్పవనము ఇటుల ముమ్మారొనర్చి, అభిమంత్రించి, |
| ఉత్తానాని పాత్రాణి పర్యావృత్య | పాత్రములను ఎత్తి(వెలికిలగా) త్రిప్పిపెట్టి. |
| త్రిః ప్రోక్షతి | ముమ్మారు ప్రోక్షించి |
| శేషముత్సిచ్య | ప్రోక్షణీపాత్రయందు మిగిలిన (ఉదకమును) ఎగజల్లి |
| ఆజ్యం విలాప్య | నేతినికాచి (మురికిని తీసివేసి) |
| అపరేణాగ్నిం పవిత్రాన్తర్హితాయా మాజ్యస్థాల్యా మాజ్యం నిరూప్య | అగ్నికి పడమటివైపున పవిత్రముచేత కప్పబడి యుండు ఆజ్యస్థాలియందు నేతిని పోసి. |
| ఉదీచోఽంగారా న్నిరూహ్య | అగ్నికి ఉత్తరపుదిశయందు అగ్ని నుండి కొంచెము నిప్పులను బయటికితీసి. |
| తేష్వధిశ్రిత్య | ఆనిప్పులయందు ఆజ్యపాత్రను పెట్టి |

| | |
|---|---|
| జ్వలతాఽ(తృణేనాధోగా మిన్యాదీప్త్యాఽఽఽజ్యే ప్రతిఫలీ కృత్య) పద్యుత్య | మండుచున్న తృణముయొక్క క్రిందికి ప్రసరించిన కాంతిచేత నేతియందు ప్రతిబింబము కలుగునట్లుచేసి |
| ద్వేదర్భాగ్రే ప్రచ్ఛిద్య | రెండుదర్భ కొనలను త్రుంచి |
| • ప్రక్షాళ్య | (ఆదర్భకొనలను) నీటిలోకడిగి |
| అప ఉపస్పృశ్య | నీటిని తాకి |
| ఆజ్యే ప్రాస్య | ఆజ్యమునందు (ఆ రెండు దర్భాగ్రములను) వేసి |
| • త్రిః పర్యగ్నికృత్వా | (దర్భను వెలిగించి) ఆయాజ్య పాత్రకు ముమ్మారు ఉదక్సమాప్తిగా చుట్టిత్రిప్పి |
| ఉదగుద్వాస్య | ఆజ్యపాత్రను ఉత్తరపువైపుగా పెట్టి |
| అంగారాన్ప్రత్యూహ్య | నిప్పులను (తిరిగి అగ్నియందే) వేసి, |
| ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహార (మాజ్యం) త్రిరుత్పూయ | ఉత్తరపు కొనలు గలిగిన రెండు పవిత్రములచేత మాటిమాటికి పైకి యెత్తి యెత్తి ముమ్మారు తనకుముందుగా ఆరంభించి ఎదురుగా తీసుకొని పోయి తిరిగి ముందుగా తీసుకొనివచ్చి ఇటుల, ఉత్పవనముచేసి. |
| • పవిత్రగ్రన్థిం విస్రస్య | పవిత్రములయొక్క ముడిని విప్పి |
| ప్రక్షాళ్య | ఆపవిత్ర దర్భలను కడిగి |
| ప్రాగగ్రమగ్నౌపవిత్రే అనుప్రహారతి | ఆపవిత్ర దర్భలను అగ్నిలో తూర్పుకొనలుగలుగునట్లు హోమముచేయవలయును. |
| యేన జుహోతి తదగ్నౌ ప్రతితప్య | దేనిచేతహోమము చేయుచున్నాడో దానిని ((సుక్స్రువములను)అగ్నిలో కాచి, |
| • దర్భైస్సమ్మృజ్య | దర్భలచేతఁ దుడిచి, |
| పునః ప్రతితప్య | మజిల హోమసాధనములగు దర్వి మొదలగు వానినికాచి, |

ప్రోక్ష్య

నిధాయ

దర్భానద్భిస్సగ్ స్పృశ్యాగ్నౌ ప్రహరతి

అగ్నిం పరిషిఞ్చతి:—

"అదితేఽనుమన్యస్వ" ఇతి దక్షిణతః ప్రాచీనం

"అనుమతేఽనుమన్యస్వ" ఇతి పశ్చాదుదీచీనం

"సరస్వతేఽనుమన్యస్వ" ఇత్యుత్తరతః ప్రాచీనం

"దేవసవితః ప్రసువ" ఇతి సమంతం

ఏకం, ద్వే, త్రీణి, చత్వారి.

ఆదర్వి మొదలగు వానిని ప్రోక్షించి

(దర్భలమీద) తనముందుంచుకొని

దర్భలను నీటియందు తాకించి అగ్నిలో నుంచవలయును

అగ్నికి నలుదిక్కుల ఉదకముతో ఈ క్రింది మంత్రములతో పరిషేచనము చేయవలయును:—

ఈమంత్రము చెప్పి అగ్నికి దక్షిణపు వైపు మొదలు తూర్పువైపునకు పరిషేచనము చేయవలయును

ఈమంత్రముచెప్పి పడమటివైపునుండి ఉత్తరపువైపునకు పరిషేచనము చేయవలయును

ఈమంత్రముచెప్పి ఉత్తరపువైపు మొదలు, తూర్పువైపునకు పరిషేచనము చేయవలయును.

ఈమంత్రమునుచెప్పి అగ్నికి చుట్టు, పరిషేచనము చేయవలయును.

అని స్రువముచేత స్రుక్కునందు ౪ సారు లాజ్యము గ్రహించి యీ క్రింది ౨ మంత్రములతో హోమద్వయము చేయవలయును.

అలఙ్కారణమ్:—

౫. అయాశ్చాగ్నేస్యనభిశస్తీశ్చ సత్యమిత్వమయా అసి। అయసా మనసా ధృతోఽయసా హవ్యమూహిషే। యానో ధేహి భేషజగ్ స్వాహా॥ అయసేఽగ్నయ ఇదం॥

పాకయజ్ఞలోపప్రాయశ్చిత్తార్థం సప్తహోతారం హోష్యామి:—

౬. మహాహవిర్హోతా। సత్యహవి రధ్వర్యుః। అచ్యుతపాజా అగ్నీత్। అచ్యుతమనా ఉపవక్తా। అనాధృష్యశ్చ ప్రతిధృష్యశ్చ యజ్ఞస్యాభిగరౌ। అయాస్య ఉద్గాతా। వాచస్పతే హృద్విధేనా మ—

విధేమ తే నామ । విధేస్త్వ మస్మాకం నామ । వాచస్పతి స్సోమ మపాత్ । మాదైవ్య స్తంతు శ్ఛేది మా మనుష్యః । నమో దివే । నమః పృథివ్యై స్వాహా॥ వాచస్పతయే బ్రహ్మణ ఇదం॥

సర్వప్రాయశ్చి త్తంకరిష్యే:—(అని సంకల్పించి స్రువముచేత ఆజ్యము గ్రహించి యీ క్రింది మంత్రముతో హోమము చేయవలయును.)

౭. ఓం భూర్భువస్సువ స్స్వాహా॥ ప్రజాపతయ ఇదం॥

| | |
|---|---|
| ఉత్తరపరిషేచనంకృత్వా:— | ఉత్తరపరిషేచనముచేసి అనగా |
| అదితేఽన్వమగ్ం స్థాః | అని దక్షిణమునుండి తూర్పునకును |
| అనుమతేఽన్వమగ్ం స్థాః | అని పడమటనుండి ఉత్తరమునకును |
| సరస్వతేఽన్వమగ్ం స్థాః | ఉత్తరపువైపు మొదలుతూర్పువైపువఱకు |
| దేవసవితః ప్రసావీః॥ | ఈశానము, మొదలు మఱల ఈశానము వఱకు ఉత్తరపరిషేచనము చేయవలయును. |

౮. శ్లో॥ శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమ్।
ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన॥ ౧

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యా తపోహోమ క్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే హుతాశనమ్॥ ౨

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన।
యద్ధుతం తు మయా దేవ పరిపూర్ణం త దస్తుతే॥ 3

చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు । ఆఙ్గీరస, బార్హస్పత్య, భారద్వాజ, త్ర్యార్షేయ ప్రవరాన్విత భారద్వాజస గోత్రః, యజుర్వేదీ తైత్తిరీయశాఖాధ్యాయీ ఆపస్తమ్బసూత్రః, నారాయణశర్మాఽహం భో అభివాదయే॥

# సమిధాధానమ్.

ఆచమ్య ॥ ఏవంప్రీత్యర్థం * ప్రాతరౌపాసనం సమిధాధాన పూర్వకం తండులైర్హోష్యామి (అని సంకల్పించి ఈక్రింది మంత్రముతో సమిత్తును అగ్నియందుంచి పిదప ఔపాసనము చేసికొనవలయును.)

౬. ఉపావరోహ జాతవేదః పున స్త్వం దేవేభ్యో హవ్యం వహా నః ప్రజానన్ । ఆయుః ప్రజాగ్ం రయి మస్మాసు ధేహ్య జస్రో దీదిహి నో దురోణే॥

## సమిధారోపణమ్.

ఆచమ్య, ఏవం=ప్రీత్యర్థం, * ప్రాతరౌపాసనాగ్నిం సమిధ్యారోపయిష్యే:—("అని సంకల్పించి")

౧౦. అయం తే యోనిర్ ఋత్వియో యతో జాతో అరోచథాః। తం జాన న్నగ్న ఆరోహాథానో వర్ధయా రయిమ్॥

గ్రామాంతరము వెళ్లవలసినయెడల ఔపాసనానంతమున సమిధారోపణ సంకల్పము సంకల్పించి "అయం తే" అను మంత్రముచెప్పి సమిత్తును అగ్నియందుంచి అగ్రమును స్వల్పముగ కాల్చి ఆసమిత్తుకు దర్భనుజుట్టి జాగ్రతగాదాచి మఱల ఔపాసనము చేసికొను సమయమునందు సమిధాధాన సంకల్పపూర్వముగ సంకల్పించి "ఉపావరోహ" అనుమంత్రముతో అగ్నియందు సమిత్తునుంచి ఔపాసనము చేసికొనవలయును.

---

* ఇచట సాయంకాలమున "సాయమౌపాసనం" అని సంకల్పమును మార్చుకొనవలయును.

# ఔపాసన హోమ ప్రకరణమ్.

## సఙ్కల్పః.

| | |
|---|---|
| ఆచమ్య, పునరాచమ్య | పూర్వాచమన మొనర్చి, మఱల ప్రత్యాచమనముచేసి |
| త్రిః ప్రాణానాయమ్య | 3 ప్రాణాయామములుచేసి, |

ఏవంగుణవిశేషణవిశిష్టే శుభేశోభనే ముహూర్తే శ్రీమాన్... గోత్రః...శర్మాభిధేయః ధర్మపత్నీ సమేతోఽహం, శ్రీమతః...గోత్రస్య ...శర్మాభిధేయస్య, ధర్మపత్నీసమేతస్య మమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం * ప్రాతరౌపాసనం తణ్డులైర్హోష్యామి॥

| | |
|---|---|
| (ఇతిసఙ్కల్ప్య) | అని సఙ్కల్పమొనర్చి |

## అగ్నిప్రజ్వాలనమ్.

| | |
|---|---|
| భూర్భువస్సువరోమ్ | అని అగ్నిని ప్రజ్వలింపఁజేసి క్రింది |
| (ఇతి అగ్నిమిద్ధ్వా) | మన్త్రముచేత ధ్యానింపవలయును, |

## ధ్యానమ్:—

౧౧. చత్వారి శృఙ్గా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య। త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ॥

---

* సాయమౌపాసనం అని సాయంకాలమున సఙ్కల్పింపవలయును.

౧౨. శ్లో. సప్తహస్త శ్చతుశ్శృఙ్గ, స్సప్తజిహ్వో ద్విశీర్షకః ।
త్రిపాత్ప్రసన్నవదన, స్సుఖాసీన శ్శుచిస్మితః॥ ౧.
శ్లో. స్వాహాన్తు దక్షిణే పార్శ్వే దేవీం వామే స్వధా న్తథా ।
బిభ్ర ద్దక్షిణహస్తైస్తు, శక్తి మన్నంస్రుచం స్రువం॥ ౨.
శ్లో. తోమరం వ్యజనం వామై, ర్ఘృతపాత్రన్తుధారయన్ ।
మేషారూఢంజటాబద్ధం, గౌరవర్ణం మహౌజసం ॥ ౩.
శ్లో. ధూమధ్వజం లోహితాక్షం, సప్తార్చి స్సర్వకామదం ।
ఆత్మాభిముఖ మాసీన, మేవన్ధ్యాయే ద్ధుతాశనమ్॥ ౪.

౧౩. ఏషహిదేవః ప్రదిశోనుసర్వాః పూర్వోహిజాతస్సఉగర్భేఅన్తః। సవిజాయమాన స్సజనిష్యమాణః ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖః॥

(ఈమంత్రముచెప్పి జలాక్షతలఁగైకొని తూర్పున జలమును పడమట నక్షతలను విడువవలయును. తరువాత ఈ క్రింది వాక్యములచే నగ్నిని ప్రార్థించవలయును.)

ప్రార్థనమ్.

ప్రాఙ్ముఖాగ్నే ! మమాభిముఖోభవ, సుముఖోభవ, సుప్రసన్నోభవ, వరదోభవ, యథోక్తజిహ్వయా హవి ర్గృహాణ॥

పరిసమూహనమ్.

౧౪. ఓం భూర్భువస్సువః। ఓంతత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్॥

సోదకేన పాణినా ప్రదక్షిణ మగ్నిం పరిసమూహ్య।

ఈమన్త్రమునుచెప్పి అగ్నికి చుట్టు ప్రదక్షిణముగ సోదకమగుపాణితో తుడువవలయును.

## అలఙ్కారణమ్

| | |
|---|---|
| ౧. అగ్నయేనమః | అనితూర్పునను, |
| ౨. హుతవహాయ నమః | అనిఆగ్నేయముసను. |
| 3. హుతాశినే నమః | అనిదక్షిణమునను. |
| ౪. కృష్ణవర్త్మనే నమః | అనినిర్ ర్ తిదిక్కునను. |
| ౫. దేవముఖాయ నమః | అనిపశ్చిమమునను. |
| ౬. సప్తజిహ్వాయ నమః | అనివాయవ్యమునను. |
| ౭. వైశ్వానరాయ నమః | అనిఉత్తరమునను. |
| ౮. జాతవేదసే నమః | అనిఐశానమునను. |
| (ఇత్యలఙ్కృత్య) | ఇట్లు ౮ దిక్కులయందు పుష్పములచేతను అక్షతలచేతను అలఙ్కరింపవలయును, |

## పరిషేచనమ్.

| | |
|---|---|
| అదితేఽనుమన్యస్వ; ఇతిదక్షిణతః ప్రాచీనం ॥ | అని దక్షిణమున, పడమరనుండితూర్పునకును, |
| అనుమతేఽనుమన్యస్వ. ఇతిపశ్చాదుదీచీనం ॥ | అని పడమట, దక్షిణమునుండియుత్తరమునకును, |
| సరస్వతేఽనుమన్యస్వ; ఇత్యుత్తరతః ప్రాచీనం ॥ | అని ఉత్తరమున, పడమరనుండితూర్పునకును, |
| దేవసవితః ప్రసువ-ఇతిసమంతం పరిషిచ్య॥ | అని ఈశానమునుండి ప్రదక్షిణముగ మరల ఐశానముదనుకను పరిషేచనము చేసి |

1. (ఆప. గృ. ౨-౭)

### తణ్డులహోమః.—

(సాయంప్రాతరతఊర్ధ్వం) హస్తేనై తేఆహుతీతణ్డులైర్యవైర్వాజుహుయాత్ ॥

చేతితో బియ్యమునుగాని యవలనుగాని గైకొని (౨ భాగములుచేసి) రెండాహుతులను హోమము చేయవలయును.

౧౫. ౧. అగ్నయేస్వాహా*॥ అగ్నయం ఇదం, నమమ ॥

మధ్యేఽగ్నౌజుహోతి

(ఈ మన్త్రము చెప్పి ౧ భాగమును) అగ్ని మధ్యయందు హోమమొనర్పవలయును.

౧౬. ౨. అగ్నయేస్విష్టకృతేస్వాహా॥అగ్నయేస్విష్టకృతఇదం,నమమ

అగ్నేరుత్తరపూర్వదేశేజుహోతి॥

(ఈ మన్త్రముచెప్పి ౨-వ భాగమును) అగ్నిలో నీశాన్యభాగమున హోమము చేయవలయును.

### వనస్పతిహోమః.—

ఆహుతిసంసర్గదోష నివృత్త్యర్థం వనస్పతిహోమంకరిష్యే:—

అని సంకల్పముచేసి ఈక్రిందిమన్త్రము చేత సమిధను అగ్నియందుంచవలయును.

౧౭. యత్రవేత్థ వనస్పతే దేవానాం గుహ్యానామాని। తత్రహవ్యాని గామయ॥ వనస్పతయ ఇదం, నమమ॥

---

* స్థాలీపాకవద్దైవతగ్ం శౌరీపూర్వాహుతిః ప్రాతరిత్యేకే॥ ఆప ॥ ౮.౨౦.౨౧ అని యుండుటచేత సాయంప్రాతఃకాలములయందు ' అగ్ని ' అగ్నిస్విష్టకృత్తులను దేవతలను గూర్చియే హోమముచేయుట ఆపస్తంబాభిమతము. కొందఱు ప్రాతఃకాలమున " సూర్యాయస్వాహా " యని ప్రథమాహుతి నొనర్తురు.

## ఉత్తరపరిషేచనమ్:—

౧. అదితేఽన్వమగ్ స్థాః। — అని దక్షిణమున పడమరనుంచి తూర్పునకును

౨. అనుమతేఽన్వమగ్ స్థాః। — పడమర దక్షిణమునుండి యుత్తరమునకును

3. సరస్వతేఽన్వమగ్ స్థాః। — ఉత్తరమున పడమరనుండి తూర్పునకును

౪. దేవసవితః ప్రాసావీః॥ — ఈశానమునుండి ప్రదక్షిణముగ మరల నీశానము దనుక ను పరిషేచనము చేసి

(పూర్వవద్యథా క్రమం పరిషిచ్య) — ఇటుల మునుపటివలె ఉత్తర పరిషేచనము చేసి నిలువుమండి ఈక్రిందిమంత్రముచే నగ్న్యుపస్థానము చేసి కూర్చుండవలయును.

## ఉపస్థానమ్:—

౧౭. అగ్నేత్వన్నోఽఅన్తమః। ఉత త్రాతా శివో భవ వరూథ్యః। తంత్వాశోచిష్ఠదీదివః। సుమ్నాయ నూన మీమహే సఖిభ్యః। వసురగ్నిర్వసుశ్రవాః। అచ్ఛానక్షి ద్యుమత్తమో రయిన్దాః। సనో బోధి శ్రుధీహవ మురుష్యాణో అఘాయతస్సమస్మాత్॥

## అనాజ్ఞాతాది మన్త్రపఠనమ్:—

హోమసాద్గుణ్యార్థ మనాజ్ఞాత త్రయమన్త్రజపంకరిష్యే:— — అని సంకల్పించి. ఈమూడుమంత్రములఁబఠింపవలయును.

౧౮. అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్యక్రియతే మిథు। అగ్నే తదస్య కల్పయ త్వగ్ం హి వేత్థ యథాతథమ్॥ ౧॥

౨౦. పురుషసమ్మితో యజ్ఞో యజ్ఞః పురుషసమ్మితః। అగ్నే తదస్య కల్పయ త్వగ్ం హి వేత్థయథాతథమ్॥ ౨॥

౨౧. యత్పాక్‌త్రా మనసా దీనదక్షాన యజ్ఞస్య మన్వతే మర్తాసః।
అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్ యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి॥

ఈశ్వరార్పణమ్.

అనేన ప్రాత రౌపాసనహోమేన జపేనచ భగవాన్ సర్వాత్మ.
కః శ్రీయజ్ఞేశ్వర స్సుప్రీణాతు॥ (ఇతి జలాక్షతాన్ విస్ృజతి) ఈవాక్యము
చెప్పి జలాక్షతల క్రింద విడువవలయును,

ప్రార్థనా, అభివాదనంచ:—

స్వస్తి.

౨౨. శ్లో. శ్రద్ధాంమేధాం యశః ప్రజ్ఞాం విద్యాంబుద్ధిం శ్రియంబలమ్।
ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హవ్యవాహన॥ ౧.

శ్లో. యస్యస్మృత్యాచ నామోక్త్యా తపో హోమ క్రియాదిషు।
న్యూనంసంపూర్ణ తాంయాతి సద్యోవన్దే హుతాశనమ్॥ ౨.

శ్లో. మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనంహుతాశన।
యద్ధుతం తు మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥
చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణే......అభివాదయే॥

పురాణాచమనంకృత్వా | అని సంకల్పించి.

ఈశ్వరార్పణమ్.

౨౩. కాయేనవాచా మనసేన్ద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్।
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

ఈ పై శ్లోకము పఠించి జలాక్షతల క్రింద విడువవలయును.

ఇతి నిత్యోపాసనమ్.

# సమస్య హోమః.

| | |
|---|---|
| ఆచమ్య | స్మృత్యాచమనము చేసి. |
| ప్రాణానాయమ్య | ప్రాణాయామమొనర్చి. |

ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం సాయమాపాసనం సమస్య హోమపక్షే మా శ్రిత్య తణ్డులైర్హోష్యామి॥

| | |
|---|---|
| ఇతిసంకల్ప్య | అని సంకల్పించి |
| అగ్నిమిధ్వా | అగ్నిని ప్రజ్వలింపజేసి |
| "చత్వారిశృఙ్గే"త్యాది పరిషేచనాన్తం కృత్వా | "చత్వారిశృంగా" అను మంత్రములో అగ్ని ధ్యానము మొదలుకొని ఔపాసనమునందువలె పూర్వపరిషేచనము దనుక సలిపి |

౨౪. అగ్నయే స్వాహా॥ అగ్నయ ఇదం, నమమ।

| | |
|---|---|
| ఇతిమధ్యేఽగ్నౌ ఆహుతి ద్వయం జుహోతి | అని అగ్నియొక్క మధ్యమునందు రెండు పర్యాయములు తండులాహుతుల ప్రేల్వవలయును. |

౨౫. అగ్నయే స్విష్టకృతేస్వాహా॥ అగ్నయే స్విష్టకృత ఇదం నమమ॥

| | |
|---|---|
| ఇతి అగ్నేరుత్తర పూర్వ దేశే జుహోతి | అని అగ్నియందీశానమున ఈశవ ఆహుతిని ఆహుతిద్వయము హోమము చేయవలయును |

౨౬. యత్రవేత్థవనస్పతే దేవానాం గుహ్యానామాని। తత్ర హవ్యాని గామయ॥ వనస్పతయ ఇదం, నమమ॥

| | |
|---|---|
| ఉత్తరపరిషేచనం కృత్వా | ఉత్తరపరిషేచనము సలిపి |
| అన్యత్సర్వం ఔపాసనవత్ * | అగ్న్యుపస్థానము మొదలు అభివాదనాన్తము సర్వము ఔపాసనముతో సమానము. |

---

*దీనిని గురించిన వివరను నిత్యకర్మాష్టక గ్రంథపీఠికయందు చూడ్వవలయును.

# పక్ష హోమః.

| | |
|---|---|
| ప్రాతరౌపాసనంహుత్వా | ప్రాతరౌపాసనము చేసికొని |
| ఆచమ్య | మఱల స్మృత్యాచమనముచేసి |
| ప్రాణానాయమ్య | 3 ప్రాణాయామములొనర్చి |

ఏవంగుణవిశేషణ విశిష్టాయాం సుభతిథౌ శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం* ప్రతిపత్సాయం ప్రభృతిచతుర్దశీపర్యన్తం చతుర్దశహోమానపక్ష్యృపతు హోమపక్షమాశ్రిత్య తండులైర్హోష్యామి.

| | |
|---|---|
| ఇతి సంకల్ప్య<br>తత్సంఖ్యయాఆహుతి ద్రవ్యోన్న యనం కార్యం | అని సంకల్పించి<br>తానెన్ని దినములకు హోమము చేయఁ దలచెనాడో అన్ని దినములకుచాలినంత హోమద్రవ్యము గ్రహింపవలయును. |
| అస్మిన్నపిపక్షే ఔపసథ్యేఽహని సాయంహోమః కర్తవ్యః | ఈనియమమునందును పక్షహోమము చేయుదినమున సాయమౌపాసన హోమము చేయవలయును. |
| ఏవమేవ ద్వితీయాయాం పక్షదిన సంఖ్యానం పూర్వవత్ | ద్వితీయాతిథియందు పక్షహోమమున కు సంకల్పించు నేని "ద్వితీయా సాయం ప్రభృతి చతుర్దశీపర్యన్తం త్రయోదశహోమానపక్ష్యృమ్య" అని సంకల్పించవలయును. |
| అత్రయజనీయేఽహని ప్రాతర్హోమః కర్తవ్యః* | ఈహోమము చేయుదినమున ప్రాతఃకాలమున ఔపాసనహోమము చేయవలయును. |

## ప్రయోగము.

సంకల్పానన్తరమున "ఓం భూర్భువస్సువరోం" అని అగ్నిని ప్రజ్వలింపఁజేసి "చత్వారిశృంగా" యనుమంత్రముతో ధ్యానము మొదలు పూర్వపరిషేచనము దనుక సలిపి ఆహుతిద్రవ్యముగ్రహించి హోమము సలిపి వనస్పతిహోమ మొనర్చి ఉత్తర పరిషేచనము చేసి అగ్న్యుపస్థానమొనర్చి "అనాజ్ఞాతాది" మంత్రములపఠించి "శ్రద్ధాం మేధాం" అను శ్లోకములతో నమస్కార మొనర్చి అభివాదన మొనర్పవలయును.

పర్వము సమాప్తము.

---

* దీనియొక్క వివరము నిత్యకర్మాత్మక గ్రంథపీఠికయందు విపులముగ చర్చించి వ్రాయఁబడియున్నది. సావధానముగ నచట చూడవలయును.

శ్రీరస్తు.

# ఆబ్దికమంత్రములకు

## ఆంధ్ర టీకాతాత్పర్యములు.

---

శ్లోకములకు తాత్పర్యమున్నూ, మంత్రములకు ప్రతిపద టీకయున్నూ, అవసరమయినచోట టీకాతాత్పర్యములు రెండున్నూ వ్రాయఁబడును.

* ఈ గుర్తు మంత్రముల కుంచఁబడును.

౧. ఈప్రదేశమునందు భూమికి భారములయి యున్న భూతప్రేతపిశాచాది దుష్టగణము లన్నియు తొలఁగి పోవుఁగాక. ఇట్టి భూతప్రేతపిశాచముల యొక్క విరోధము లేకుండుటచేత నే నిప్పుడు వైదికకర్మ(యగు ప్రత్యాబ్దిక శ్రాద్ధము)ను చేయుట కుపక్రమించుచున్నాను.

౨. ౧. సకలసంపదలను కలుగఁజేయుటకు కారణభూత మైనదియు, సకలాపదల నశింపఁజేయునట్టిదియు, దరిగానరాని సంసారసాగరమును దాఁటుటకు వారధియునగు బ్రాహ్మణపాదధూళి నన్ను పవిత్రునిగఁ జేయుఁగాక.

౨. ౨. ఆపద యను గాఢాంధకారమునకు సూర్యునివంటిదియు, కోరిన కోర్కె లను సఫలము చేయుటకు కామధేనువువంటిదియు, పుణ్యతీర్థోదకమువలె పవిత్ర యైనదియు అగు బ్రాహ్మణపాదధూళి నన్ను కాపాడుఁగాక.

3. మనుష్యులకుఁగల దేహ,మనోవ్యాధులను తొలఁగించునవియు, అకాలమృత్యు దరిద్రత్వములను నశింపఁజేయునవియు, సంపత్తు, పుష్టి, కీర్తులను ఇచ్చునవియు అగు బ్రాహ్మణులపాదపద్మములకు నమస్కారము.

౨. ౪. బ్రాహ్మణసంఘమును కనులారఁ గాంచినతోడనే వాఁ డొనర్చిన పాపరాశి నశించుచున్నది. ఆబ్రాహ్మణులకు నమస్కరించిన శుభము కలుగును. వారిని పూజించిన అక్షయమయిన మోక్షము లభించును.

౨. ౫. బ్రహ్మణ్యదేవునకు నమస్కారము. గోవులకు బ్రాహ్మణులకు హితము చేయువాఁడును, లోకములకు హితము కోరువాఁడును, వేదవేద్యుఁడును అను శ్రీ కృష్ణునకు నమస్కారము.

౩. * (యావతీ... శ్రీకాతి॥ తై-ఆ- ౨-౧౯-౧౫) దేవతాః = (అగ్ని మొదలు

కాని విష్ణువనఁబడు(గల) దేవతలు, యావతీః వై = ఎందఱు గలరో, తాః సర్వాః = ఆదేవతలందఱు, వేదవిది = అర్థసహితముగ వేదమును పఠించిన, బ్రాహ్మణే = బ్రాహ్మణునియందు, వసంతి = నివసించుచున్నారు. తస్మాత్ = (బ్రాహ్మణుఁడు సర్వదేవతాస్వరూపుఁడు) గనుక, వేదవిద్భ్యః = వేదము నెఱింగిన, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకొఱకు, దివేదివే = ప్రతినిత్యము, నమస్కుర్యాత్ = నమస్కరింపవలయును, అశ్లీలం = (ఆబ్రాహ్మణులయం దున్నట్టియు, లేనట్టియు) అమంగళమును, నకీర్తయేత్ = పలుకఁగూడదు. (బ్రాహ్మణులయెడ నిట్లు ప్రవర్తించిన యెడల) ఏతాః దేవతాః ఏవ = ఈదేవతలు (అందఱును), ప్రీణాతి = ప్రీతినిపొందుచున్నారు.

౪. ౧. దేవతలకు, పితృదేవతలకు, మహాయోగులకు నమస్కారము. స్వధా, స్వాహాదేవతలకు ఎల్లప్పుడు నమస్కారము.

౪. ౨. స్వయంప్రకాశుఁడును, సర్వనియామకుఁడును, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, సర్వశిక్షకుఁడును, సదా శివస్వరూపుఁడును అగు పరమాత్మ పితృదేవతాస్వరూపియై ఇప్పుడు నేను చేయుసత్కర్మముచేత సంతుష్టుఁ డగుఁగాక.

౫. (ఓభోక్త్రబ్రాహ్మణోత్తములారా! మీరు) నేను చేయుచున్న యీ శ్రాద్ధకర్మమందు, కోపరహితులై, పవిత్రులయి ఎల్లప్పుడు బ్రహ్మవిచారము చేయుచున్నవారలయి ఉండవలయును. నేనున్నూ అట్లే యుందును.

౬. * (శంనో... నః। తై-అ-౪-౪౨) దేవీః = ప్రకాశించుచున్న, ఆపః = జలములు, నః = మాకు, అభిష్టయే = ప్రియమయిన, పీతయే = త్రాగుటకొఱకు, శం = సుఖమునకు కారణముగా, భవంతు = అగుఁగాక. (మఱియు) నః = మాకు, శం = సుఖము కలుగునట్లుగను, యోః = దుఃఖము పోవునట్లుగను, అభిస్రవంతు = అంతటను ప్రవహించుఁగాక.

౭. * (శుక్రమసి... రశ్మిభిః॥ తై-సం-౧-౧-౧౦-౩) (ఓయాజ్యమా నీవు) శుక్రం = దీప్తికలదానవు, అసి = అగుచున్నావు, జ్యోతిః = కాంతిగలదానవు, అసి = అగుచున్నావు, తేజః = తేజస్సుగలదానవు, అసి = అగుచున్నావు, వః = (ఓ యుదకములారా!) మిమ్ములను, సవితా = ప్రేరకుఁడగు, దేవః = పరమేశ్వరుఁడు, అచ్ఛిద్రేణ = ఛిద్రములేని, పవిత్రేణ = పవిత్రముచేత, వసోః = కిరణకాంతిగల, సూర్యస్య = సూర్యునియొక్క, రశ్మిభిః = కిరణములచేత, ఉత్పునాతు = పవిత్రములయినవానినిగాఁ జేయుఁగాక. (ఈపాదప్రక్షాళనసమయమునందు నేలని పాదములకు రాచి ఉదకముతో పాదములను కడుగుచున్నాఁడు కనుక కొంతభాగము ఆజ్యమునకు కొంత ఉదకమునకు మంత్రార్థము సంబంధించి యున్నది.)

౮. * (చరణం...తరేమ॥ తై-బ్రా-౩-౧౨-౩-౪) యేన = ఏపూజ్యమయిన బ్రాహ్మణపాదముచేత, పూతః = పవిత్రుఁడుగాఁ జేయఁబడినవాఁడై, దుష్కృతాని = సకలపాపములను, తరతి = అతిక్రమించుచున్నాఁడో, (అట్టి) చరణం = (ఈ బ్రాహ్మణ) పాదము, పవిత్రం = పవిత్రమైనది, వితతం = ప్రసిద్ధమయినది, పురాణం = అతిప్రాచీనమయినది, (వయం = మేము) శుద్ధేన = స్వయముగా పరిశుద్ధమయినదియు, పవిత్రేణ = (ఇతరులనుకూడ) పవిత్రులనుగాఁ జేయునదియు నగు, తేన = ఆ బ్రాహ్మణపాదముచేత, పూతాః = పవిత్రులముగాఁ జేయఁబడినవారలమయి, అతిపాప్మానం = మహాపాతకరూపమగు, అరాతిం = శత్రువును, తరేమ = అతిక్రమింతుముగాక. (పాపమును నశింపఁజేసికొందుముగాక యని భావము.)

౯. * (లోకస్య...దధాతు॥ తై-బ్రా-౩-౧౨-౩-౪.) లోకస్య = ఇహపరలోకములకు (అనఁగా ఇహపరలోకసుఖములు పొందుటకు) ద్వారం = ద్వారభూతమయినదియును, అర్చిమత్ = పూజింపఁదగినదియును, పవిత్రం = పరిశుద్ధిని కలుగఁజేయునదియు, జ్యోతిష్మత్ = ఇతరులనుకూడ ప్రకాశింపఁజేయునట్టి కాంతిగలదియును, భ్రాజమానం = మిక్కిలి ప్రకాశించునదియును, మహస్వత్ = మాహాత్మ్యము కలదియును, బహుధా = అనేకవిధములుగా, అమృతస్య = అమృతముయొక్క, ధారాః = ధారలను, దోహమానం = పిదుకునదియు, అనఁగా ఇచ్చునట్టిదియునగు, చరణం = బ్రాహ్మణపాదము, నః = మాకు, లోకే = ఇహపరలోకములందు, సుధితాం = సుఖస్థితిని, దధాతు = కలుగఁజేయుఁగాక.

౧౦. (చూడుఁడు. ౨. ౫. శ్లో.)

౧౧. * (మయి... వీర్యం॥ ఏకాగ్ని॥ ౨-౯-౧౪.) మయి = నాయందు, మహః = పూజ, మయి = నాయందు, యశః = కీర్తి, మయి = నాయందు, ఇంద్రియం = నేత్రము మున్నగు ఇంద్రియములపాటవము, వీర్యం = పరాక్రమము, (అస్తు = కలిగియుండుఁగాక.)

౧౨,౧౩,౧౪,౧౫,౧౬,౧౭, (చూఁడుడు ౬-౭-౮, ౯-౧౦-౧౧ సంఖ్యలు.)

౧౮. కర్త యగువాఁడు తా నెచ్చట నివసించి యున్నను పితృతృప్తికి శ్రాద్ధము నాచరించుసమయమునందు గయను, గయయందుండు గదాధరుని స్మరించి వారికి నమస్కరించి తరువాత శ్రాద్ధమును చేయవలయును.

౧౯. (చూ. ౪ సంఖ్య)

౨౦. * (అపహతా...సునః॥ ఆప-శ్రౌ-౧-౭-౧౩) యే = ఏ, అసురాః = అసురులును, రక్షాంసి = రాక్షసులును, పిశాచాః = పిశాచములును, పృథివీం అను = ఈభూమి ననుసరించి (నేను చేయుపనులకు విఘ్నమును కలుగఁజేయవలయు నను

తలంపుతో), క్షియంతి=నివసించుచున్నారో, (తే=వారు), ఇతః=ఈప్రదేశము నుండి, అపహతాః=తఱుమఁగొట్టఁబడినవారగుదురుగాక. (ఆ అసుర, రాక్షస, పిశాచాదులు), ఇతః అన్యత్ర=ఈప్రదేశముకంటె వేఱయిన, యత్ర=ఏప్రదేశమునకు, ఏషాం=వీరియొక్క, మనః=మనస్సు, గతం=పోయినదో, (తత్ర=ఆప్రదేశమునకు వారు) గచ్ఛంతు=పోవుదురుగాక.

౨౧. * (ఉదీరతా...హవేషు, తై-సం-౨-౬-౧౨-౩) (పితరులు మూఁడు విధములుగా నున్నారు:—

౧. యథావిధిగ శ్రౌతకర్మములను చేసి పితృలోకమును పొందినవారు ఉత్తములు.

౨. స్మార్తకర్మమమాత్ర మాచరించి పితృలోకమును పొందినవారు మధ్యములు.

౩. స్మార్తకర్మములందు కొన్నిసంస్కారములు ఆచరింపకముందే కాలవశము నందినవారు సాధారణులు.) అవరే=స్మార్తకర్మములు పైతము సమగ్రముగ నాచరింపకముందే మరణము నందినసాధారణపితరులు, ఉదీరతాం=ఉత్తమమయిన హవిస్సును పొందెదరుగాక, పరాసః=శ్రేష్ఠులగు పితరులును, ఉత్=ఉత్తమమయిన హవిస్సును పొందెదరుగాక, మధ్యమాః=మధ్యమపితరులును, ఉత్=ఉత్తమమయినహవిస్సును పొందెదరుగాక. (ఆపితరులందఱు) సోమ్యాసః=మాయందు దను గ్రహబుద్ధి కలిగియుందురుగాక, అవృకాః=హింసారహితులగు, యే=ఏపితరులు, ఋతజ్ఞాః=మే మొనర్చుచున్న పితృయజ్ఞము నెఱింగినవారలయి, అసుం=మా ప్రాణసంరక్షణార్థము, ఈయుః=వచ్చియున్నారో, తే=అట్టిపితరులు, హవేషు=మాయాహ్వానములయందు, నః=మమ్ములను, అవంతు=సంరక్షింతురుగాక.

౨౨. * (విశ్వేదేవాసః-నిషీదత॥ ఋ-సం-౨-౪౧) విశ్వేదేవాసః=ఓవిశ్వేదేవతలారా! ఆగత=(ఈప్రదేశమునకు) దయచేయుఁడు, ఇమం=ఈ, హవం=పిలుపును, శ్రుణుత=వినుఁడు, ఇదం బర్హిః=ఈదర్భలయందు, ఆనిషీదత=కూర్చుండుఁడు.

౨౩. మహాత్ములును, పరాక్రమవంతులును అగు ఓవిశ్వేదేవతలారా! ఈ పితృశ్రాద్ధమునందు ఆహ్వానింపఁబడినమీరు సావధానులరయి యుండవలయును,

౨౪. * (విశ్వేదేవాః...యధ్వం॥ తై-సం-౨-౪-౧౪-౫) అంతరిక్షే=అంతరిక్షలోకమునందు, యే=ఏవిశ్వేదేవతలు గలరో, ఉపద్యవి = స్వర్లోకమునందు, యే=ఏవిశ్వేదేవతలు, స్థ=ఉన్నారో, అగ్నిజిహ్వాః=అగ్నిముఖముగాఁగలవారలయి, యే=ఏవిశ్వేదేవతలు గలరో, ఉతవా=మఱియు, యజత్రాః=యజనము చేయుస్వభావముగలవారలయి ఏవిశ్వేదేవతలు గలరో, (అట్టి)విశ్వేదేవాః=ఓవిశ్వే

దేవతలారా !, ఇమం=ఈ, మే=నాయొక్క, హవం=ఆహ్వానమును, శ్రుణుత=వినండి, అస్మిన్ బర్హిషి=ఈదర్భలయందు, ఆసద్య=కూర్చుండి, మాదయధ్వం=సంతోషపడుడు.

౨౫. * (ఓషధయః... పారయామసి॥ తై-సం-౪-౨-౬-౫) రాజన్=ఓ రాజా; బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, యస్మై=ఎవనికొఱకు, (ఏరోగికొఱకు) కరోతి = (మామూలికచేతరోగచికిత్సను) చేయుచున్నాఁడో, తం=అట్టిరోగిని, పారయామసి=(మేము వ్యాధిని పోఁగొట్టి) కాపాడుచున్నాము. (అని) ఓషధయః=ఓషధ్యభిమానిదేవతలు, రాజ్ఞా=(తమకు) ప్రభువగు, సోమేనసహ=చంద్రునితోడ, సంవదంతే=సంవాదముచేయుచున్నవి.

౨౬. * (పవిత్రే... పునాతు॥ తై-బ్రా-౩-౨-౪-౧౧)=ఓపవిత్రములారా ! (మీరు) వైష్ణవీ=విష్ణుసంబంధముగలవారలు. స్థ=అగుచున్నారు, వాం=మిమ్ములను, వాయుః=వాయుదేవత, మనసా = మనస్సుచేత, పునాతు = పావనములనుగాచేయుఁగాక.

౨౭. (చూ. ౬ మంత్రము)

౨౮. (యవో... స్మృతం॥ ఆశ్వలాయనగృహ్యపరిశిష్టము అ-౨) యవః=ఓయవధాన్యమా ! (నీవు), ధాన్యరాజః వా=ధాన్యములన్నిటికంటె శ్రేష్ఠమయినదానవు, వారుణః=వరుణదేవతకు సంబంధించినదానవు, మధుసంయుతః=మాధుర్యముగలదానవు, సర్వపాపానాం=సకలపాపములను, నిర్ణోదః=నశింపఁజేయుదానవును, అసి=అగుచున్నావు, (మఱియు) ఋషిభిః=మహర్షులచేత, పవిత్రం=పావనమయినదానవు, అని, స్మృతం=చెప్పఁబడినదానవగుచున్నావు.

౨౯, ౩౦, ౩౧, ౩౨. * (యాదివ్యా... భవన్తు॥ తై-బ్రా-౩-౧-౨-౩; ఆశ్వ-గృ-పరి.) యాః=ఏ, ఆపః=ఉదకములు, దివ్యాః=ద్యులోకమునకుసంబంధించినవో, యాః=ఏయుదకములు, పయసా=పాలతోడ, సంబభూవుః=కలసియున్నవో, యాః=ఏయుదకములు, అంతరిక్షే=అంతరిక్షమునం దున్నవో, ఉత=మఱియును, యాః=ఏయుదకములు, పార్థివీః=భూలోకమునకు సంబంధించియున్నవో, హిరణ్యవర్ణాః=బంగారుచాయవంటిచాయగల, యజ్ఞియాః=యజ్ఞార్హములయిన, తాః ఆపః=ఆయుదకములు, నః=మాకు, స్యోనాః=క్షేమమును కలుగఁజేయునవియు, శం=సుఖమునుకలుగఁజేయునవియు, భవంతు=అగుఁగాక.

౩౩. * (గంధ=శ్రియం॥ తై-ఆ-౧౦-౧-౧౦) గంధద్వారాం=వాసనచేత గ్రహింపఁదగినదియు, దురాధర్షాం=దుష్టులచేత అవమానింపఁబడుటకు శక్యము

కానిదియు, నిత్యపుష్టాం=ఎల్లప్పుడు ధాన్యాదిపరిపూర్ణమై యుండునదియు, కరీషిణీం=గోమయము (పశుసంపద) గలదియు, సర్వభూతానాం=సకలభూతములకు, ఈశ్వరీం=అధిపతియు, శ్రియం=సేవింపఁదగినదియునగు, తాం=ఆమృదభిమాని దేవతను, ఇహ=ఇచటికి, ఉపహ్వయే=ఆహ్వానముచేయుచున్నాఁడను.

౩౪. * (అర్చత=ర్చత॥ తై-ఋ-సం-౬-౯-౧) (ఓయజమానుల్లారా! మీరు) అర్చత=పరమేశ్వరుని పూజింపుఁడు, ప్రార్చత=స్తుతించుచు చక్కఁగా పూజింపుఁడు, ప్రియమేధాసః=ఓప్రియమేధగోత్రముగలవారా!, అర్చత=భగవంతుని పూజింపుఁడు, పుత్రకాః=పుత్త్రులు, అర్చంతు=పరమేశ్వరుని పూజచేసెదరుగాక, ఉత=మఱియు, ధృష్ణు=ధైర్యముగల, పురంన = పురుషునివలె, అర్చత=పరమేశ్వరుని పూజింపుఁడు.

౩౫ * (ధూరసి=ధూర్వామః॥ తై-సం-౧-౧-౪) ధూః=(ఓదేవతలారా! మీరు పాపాత్ములను) హింసించువారలు అగుచున్నారు. ధూర్వంతం=పాపాత్మకము హింసించుదానిని అనఁగా పాపమును, ధూర్వ=నశింపఁజేయుఁడు. యః=ఎవ్వఁడు, అస్మాన్=మమ్ములను, ధూర్వతి=హింసించుచున్నాఁడో, తం=వానిని, ధూర్వ=నాశమును పొందించుఁడు, యం=మాయందు నివసించియున్న అలస్యప్రమాదాదిరూపమగు ఏశత్రువును, వయం=మేము, ధూర్వామః=హింసింపనిశ్చయించినారమో, తం=అట్టియాలస్యాదిరూపమగు శత్రువును, ధూర్వ=నాశమును పొందింపుఁడు.

౩౬. * (ఉద్దీప్యస్వ=దిశ॥ తై-ఆ-౧౦-౧-౪) జాతవేదః=ప్రాణులయొక్క ఉదరమునందు జఠరాగ్నిరూపముననున్న ఓయగ్నిదేవా!, ఉద్దీప్యస్వ=మమ్ముల నను గ్రహించుకొనుచు ప్రజ్వలింపుము, మమ=నాయొక్క, నిర్ ఋతిం=పాపాభిమాని దేవతను, అపఘ్నన్=పోఁగొట్టుచున్నవాఁడవై, మహ్యం=నాకొఱకు, పశూన్=పశుసంపదను, జీవనంచ=దీర్ఘాయువును, ఆవహ=కలుగఁజేయుము, దిశః=నేను సుఖముగా నుండుటకు తగినప్రదేశములను, దిశ=కలుగఁజేయుము.

౩౭. * (యువా=యంతః॥ తై-బ్రా-౩-౬-౧) సువాసాః=మంచివస్త్రములు ధరించిన, యువా=యౌవనవంతుఁడు, ఆగాత్=వచ్చునో, (తథా=ఆవిధముగా,) పరివీతః=రశనచేతకట్టఁబడినదై ఈకర్మమందు యూపము (ఆగాత్=వచ్చుచున్నది) సః ఉ=ఆయూపము, జాయమానః=ఈకర్మమందు జన్మించినదై, శ్రేయాన్=దిన దినమునకు మిక్కిలి ప్రశస్తమైనది, భవతి=అగుచున్నది, తం=అట్టియూపమును, ధీరాసః=బుద్ధిమంతులును, కవయః=విద్వాంసులును, స్వాధియః=స్వతంత్రులును,

దేవయంతః=దేవతలను పొందుట కిచ్ఛ గలవారును అగు యజమానులు, ఉన్నయంతి=స్తుతులచేత గౌరవించుచున్నారు.

☞ "సువాసాః యువా" అనుపదములున్నంతమాత్రముచేత ఇచట ఈమంత్రము పరిగ్రహింపఁబడినది. సామాన్యముగ ఇట్టిమంత్రములుకూడ తెలుచుగ ఇట్టివిషయములందు గ్రహించుట గలదు.

౩౭. * (తై-సం-౨౬-౧౨-౧) (ఓయగ్నిదేవా !) ఉశంతః=(పితరులను) కోరెడి (మేము) త్వా=నిన్ను, హవామహే=పిలుచుచున్నారము, ఉశంతః=(పితృదేవతలను) కోరుచున్న (మేము) సమిధీమహి=ప్రజ్వలింపఁజేయుచున్నారము, ఉశన్=(నీవును) కోరినవాఁడవయి, ఉశతః=మేము కోరుచున్నట్టి, పితౄన్=పితృదేవతలను, హవిషే అత్తవే=హవిస్సును తినుటకొఱకు, ఆవహ=పిలువుము.

౩౯. * (నమోవః=భూయాసం॥ తై-సం-౩-౨-౫-౫) పితరః=ఓపితృదేవతలారా ! వః=మీయొక్క, రసాయ=శ్రేష్ఠత్వముకొఱకు, నమః=నమస్కారము, పితరః=ఓపితృదేవతలారా ! వః=మీయొక్క, శుష్మాయ=బలముకొఱకు, నమః=నమస్కారము, పితరః=ఓపితృదేవతలారా ! వః=మీయొక్క, జీవాయ=జీవాత్మకొఱకు, నమః=నమస్కారము, పితరః=ఓపితృదేవతలారా ! వః=మీయొక్క, స్వధాయై=స్వధాకారముకొఱకు, నమః=నమస్కారము, పితరః=ఓపితృదేవతలారా ! వః=మీయొక్క, మన్యవే=కోపముకొఱకు, నమః=నమస్కారము, పితరః=ఓపితృదేవతలారా ! వః=మీయొక్క, ఘోరాయ=శిక్షారూపమయి ఉగ్రమయినకార్యముకొఱకు, నమః=నమస్కారము, పితరః=ఓపితరులారా ! వః=మీకు, నమః=నమస్కారము. (ఏ మీరు ఇతరులతోకూడా) ఏతస్మిన్ లోకే=ఈపితృలోకమునందున్నారో, తే=వారు, యుష్మాన్ అను=మిమ్ములను అనుసరింతురుగాక, యే=ఏమీరు, అస్మిన్ లోకే స్థ=ఈలోకమునందున్నారో, తే=ఆమీరు, మాం అను=నన్ను అనుసరించెదరుగాక, యే=ఏమీరు, ఏతస్మిన్ లోకే స్థ=ఈలోకమునందున్నవారలయి, యూయం=మీరు, తేషాం=వారిలో, వసిష్ఠాః=శ్రేష్ఠులుగా, భూయాస్థ=అయితిరో, యే=ఏమనుష్యులు, అస్మిన్ లోకే=ఈలోకమునందు, స్థ=ఉన్నారో, తేషాం=వారికి, అహం=నేను, వసిష్ఠః=శ్రేష్ఠుఁడనుగా, భూయాసం=అయ్యెదనుగాక.

౪౦. * (ఆయన్తు... న్త్వస్మాన్॥ వా. సం-౧౩-౫౭.) నః=మాయొక్క, పితరః=పితృదేవతలు, ఆయంతు=మాసమీపమునకు వచ్చెదరుగాక, అగ్నిష్వాత్తాః=అగ్నిష్వాత్తులనుపేరుగలట్టియు, సోమ్యాసః=సోమపానార్హులయినట్టియు,

(మాపితరులు) దేవయానైః పథిభిః = దేవతలతోడకలసి చరించుమార్గములచేత, (ఇచ్చ టికి విచ్చేసి) అస్మిన్ యజ్ఞే = ఈపిత్రుయజ్ఞమునందు, స్వధయా = అన్నాదులచేత, మదంతు = తృప్తిని పొందెదరుగాక, తే = ఆపితరులు, అస్మాన్ = మమ్ములను, అధిబ్రువంతు = అధికులగునటులు పలికెదరుగాక. (ఆపితరులవాఙ్మాహాత్మ్యముచేత మేమున్నూ అధికుల మయ్యెదముగాక)

౪౧. చూ-౨౦-సంఖ్య) ౪౨. (చూ-౨౬-సంఖ్య) ౪౩. చూ-౬-సంఖ్య)

౪౪-౪౫-౪౬ * (తిలోఽసి...ఏహి॥ ఆశ్వ-గృ-౪-౭-౧౧) తిలః = ఓతిల లారా! మీరు, గోసవః = దాతయగువానికి స్వర్గము నిచ్చునట్టియు, దేవనిర్మితః = దేవతలచేత నిర్మింపఁబడినట్టియు, సోమదేవత్యః = సోముఁడు దేవత గాఁగలవియు, అసి = అగుచున్నారు, ప్రత్నవద్భిః = పూర్వికులగువారితోడ, ప్రత్నవత్ = పురాతనుఁడవగునీవు, స్వధే = పితృదేవతల కొసంగఁ దగినయన్నముకొఱకు, ఏహి = ఇచ్చుటకు రమ్ము.

౪౭ మొదలు ౫౪. (చూ-౨౯,౩౭. సంఖ్యలు క్రమముగ చూడవలయును.)

౫౫. * (సోమాయ...స్వాహా॥ తై-బ్రా-౧-౩-౧౦-౨) పితృపీతాయ = అమృతరూపమగుటచేత పితరులచేత త్రాగఁబడెడి, సోమాయ = సోమునికొఱకు, స్వధా = ఈస్వధాకారము అగుఁగాక, నమః = నమస్కారము, స్వాహా = హవిస్సు ఇయ్యఁబడినది.

౫౬. * (యమాయ...స్వాహా॥ ఆప-శ్రౌ-౧-౮-౪) అంగిరస్వతే = అంగిరసులతో కూడియున్నవాఁడును, (లేక) వాయువుతోఁ గూడినవాఁడున్ను, పితృమతే = అన్నముగలవాఁడునుఅగు, యమాయ = యమునికొఱకు, స్వధా = స్వధాకారము, నమఃస్వాహా = నమస్కారము. హవిస్సియ్యఁబడినది.

౫౭. * (అగ్నయే...స్వాహా॥ తై-బ్రా-౧-౩-౧౦-౩.) కవ్యవాహనాయ = కవ్యమును వహించెడి, అగ్నయే = అగ్నికొఱకు, స్వధా = స్వధాకారము, నమః స్వాహా = నమస్కారము, హవి స్సియ్యఁబడినది.

☞ హవ్యమనఁగా దేవతలకిచ్చెడిహవిర్ద్రవ్యము. కవ్యమనఁగా పితరులకొసంగు ద్రవ్యము. పితరులకొఱకు హోమ మొనర్చునప్పుడు మంత్రాంతమునందు స్వధాకారమును చేర్చవలయును. దేవతలకొఱకు హోమ మొనర్చునప్పుడు మంత్రాంతమునందు స్వాహాకారమును జేర్చవలయును.

౫౮. (అస్వధే...పితౄణాం॥ తై. బ్రా. ౧-౬-౯-౫.) అస్వధా = "అస్వధా"యని, ఆశ్రావయతి = వినిపించుచున్నాఁడు. "అస్తుస్వధా" ఇతి = "అస్తు స్వధా"యని, ప్రత్యాశ్రావయతి = బదులు సమాధాన మిచ్చుచున్నాఁడు.

స్వధానమః ఇతి = "స్వధా నమః"యని, వషట్కరోతి = వషట్కారము చేయుచున్నాఁడు. (వషట్కార మొనర్చునప్పుడు నిలుచుండి హోమము చేయుదురు) పితౄణాం = పితృదేవతలకు, స్వధాకారః హి = (అన్నిటియందును) "స్వధాకారము" చేర్పఁబడును గదా. (పితరులనుగూర్చి మనము ఏమి చెప్పినను, వారందులకు సమాధాన మిచ్చినను, వషట్కారము చేసినను, అన్నిటియందున్ను "స్వధాకారము" చేరి యుండవలయును.

౫౯. (నమో... శాంతిః॥ తై. ఆ. ౨-౧౨-౧.) బ్రహ్మణే = వేదమునకు, నమః = నమస్కారము, అగ్నయే = అగ్నికొఱకు, నమఃఅస్తు = నమస్కారము నగుఁగాక, పృథివ్యై = భూమికొఱకు, నమః = నమస్కారము. ఓషధీభ్యః = ఓషధులకొఱకు, నమః = నమస్కారము. వాచే = వాగధీశ్వరియగు సరస్వతికొఱకు, నమః = నమస్కారము. వాచస్పతయే = వాగధిపతియగు బృహస్పతికొఱకు, నమః = నమస్కారము, బృహతే = సర్వవ్యాపకుఁడగు, విష్ణవే = శ్రీమహావిష్ణువుకొఱకు, నమః కరోమి = నమస్కారము చేయుచున్నాఁడను.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః = ముమ్మాటికి శాంతి కలుగుఁగాక.

౬౦. అన్నసూక్తము:— వేదమునం దచ్చటచ్చటఁ గల పవిత్రతమములగు మంత్రములు కొన్ని సేకరించి వానికి అన్నసూక్తమని పేరుపెట్టిరి.

"సహవై దేవానాం. తై. ఆ. ౨-౧ అను ప్రథమానువాకమునందు యజ్ఞోపవీత మాహాత్మ్యము చెప్పఁబడినది.

"రక్షాగ్ంసి హవా॥ తై. ౨. ౧-౨ అను ద్వితీయానువాకమునందు సంధ్యావందనవిధిప్రాశస్త్యములు వివరింపఁబడినవి.

"అహమస్మి ప్రథమజా॥ తై. బ్రా. ౨-౭-౭. అను ౩వ యనువాకము, అన్నమాహాత్మ్యమును తెలుపునది.

"కిగ్గ్ స్విదాసీత్పూర్వచిత్తిః॥ తై. సం. ౪-౮-౧౭. యను ౪వ యనువాకము, బ్రహ్మోద్యమునకు సంబంధించినది. బ్రహ్మోద్యమనఁగా ఆత్మవిషయకమయిన ఉత్తర ప్రత్యుత్తరములు.

"తేజసా వా ఏష బ్రహ్మవర్చసేన వ్యృధ్యతే॥ తై-బ్రా-౩-౯-౫. యను ౬వయనువాకము, పై బ్రహ్మోద్యానువాకమునకు బ్రాహ్మణము.

"ఆబ్రహ్మన్బ్రాహ్మణో॥ తై. సం. ౭-౫-౧౭-౧. అను ౬ వయనువాకము దానికి బ్రాహ్మణరూపమగు (తై. బ్రా. ౩-౭-౧౩-౧) అనువాకముకూడ నిందు పరిగ్రహింపఁబడినది. దేశక్షేమమును అభిలషించునది.

"అన్నాద్వై ప్రజాః ప్రజాయంతే॥ తై. ఆ. ౮-౨-౧. అను రెండవయనువాకము ఉపనిషదంతర్గతము అన్నమహిమను వ్యక్తీకరించును.

౬౧ * (దేవ...సువ॥ తై. సం. ౧-౭-౭.) సవితః = మాహృదయములందంతర్యామివై యుండి మనుష్యుల నాయాకృత్యములు చేయుటకు ప్రేరేపించునట్టి, దేవ = ఓపరమేశ్వరా! ప్రసువ = (ఈపిత్రుయజ్ఞమును చక్కఁగా) జరిపింపుము.

౬౨. * (పృథివీ...లోకే॥ ఏకాగ్ని. ౨-౨౦) (ఓయన్నమా!) తే = నీకు, పృథివీ = భూమియే, పాత్రం = పాత్రమగుచున్నది, ద్యౌః = ద్యులోకము, అపిధానం = ఆచ్ఛాదనము (పైమూఁత) అగుచున్నది, త్వా = నిన్ను, బ్రహ్మణః = బ్రాహ్మణునియొక్క, ముఖే = ముఖమునందు, జుహోమి = (పితృప్రీతినిమిత్తము) హోమము చేయుచున్నాను. త్వా = నిన్ను, బ్రాహ్మణానాం = బ్రాహ్మణులయొక్క, ప్రాణాపానయోః = ప్రాణాపానములయందు, జుహోమి = హోమముచేయుచున్నాను. (ఓయన్నమా! నీవు) అక్షితం = అక్షయమైనదానవు, అసి = అగుచున్నావు. ఇహ = ఈలోకమునందు బ్రాహ్మణులకును, అముష్మిఁల్లోకే = పరలోకమునందు పితరులకున్ను, మాక్షేష్ఠాః = నాశనమును పొందవద్దు.

౬౩ * (ఇదం...సురే॥ తై. సం. ౧-౨-౧౩) విష్ణుః = త్రివిక్రమావతారధారియగు శ్రీమహావిష్ణువు, ఇదం = ఈజగత్తును ఉద్దేశించి, విచక్రమే = ఎపుడు తన కాలు పెట్టెనో ఆకాలమునందు, త్రేధా = మూఁడుగా, పదం = పాదమును, నిదధే = ఉంచెను. అస్య = ఈశ్రీమహావిష్ణువుయొక్క, పాంసురే = ధూళితోఁగూడిన పాదమునందు, సమూఢం = ఈజగత్తంతయు లీనమయియున్నది.

౬౪. *(యేదేవా...షధ్వం॥ తై. సం. ౧-౪-౩) దేవాః = ఓదేవతలారా!, యే = ఏవిూరు, దివి = ద్యులోకమునందు, ఏకాదశ = పదునొకండుగురుగా, స్థ = ఉన్నారో, పృథివ్యాం అధి = భూమియందు, ఏకాదశస్థ = పదునొకండుగురుగానున్నారో, మహినా = తమప్రభావముచేత, అప్సుషదః = అంతరిక్షలోకమునందు, ఏకాదశ = పదునొకండుగురుగా నున్నారో, తే దేవాః = ఆవిూరందఱు దేవతలున్నూ, ఇమం యజ్ఞం = ఈయజ్ఞమునుగూర్చి, జుషధ్వం = ప్రీతికలిగియుండుఁడు.

౬౫.౬౬.౬౭. (చూ. ౬౧-౬౩)

౬౮. * (యే చేహ. ఏకా. ౨-౧౯-౮) ఇహ = ఈలోకమునందు, యేచ పితరః = ఏపితరులున్నారో, ఇహ = ఈలోకమునందు, యేచన = ఏపితరులులేరో, యాఁశ్చవిద్మ = ఏపితరులను మేము తెలిసికొనియున్నారమో, యాఁ ఉచ నవిద్మ = ఏపితరులను మేము తెలిసికోలేదో, అగ్నే = జాతవేదసుఁడవగు ఓయగ్నీ! నీవు,

తాన్ వేత్థ యది = ఆపితరులనందఱను తెలిసికొని యున్నాఁడవు. స్వధాభిః = ఈస్వధాకారములచేత, సుకృతం = మంచిదయిన, యజ్ఞం = పిత్ర్యయజ్ఞమును, జుషస్వ = ప్రీతిపూర్వకముగ అనుగ్రహింపుము. (అనఁగా-పితరుల కందఱకును ఈపితృయజ్ఞఫలము చెంది వారికి సద్గతులు కలుగునటు లనుగ్రహింపు మని భావము)

టీ. ౧, ౨. మీరేడుగురును, దశార్ణదేశమునందు బోయవారలుగను, కాలంజనపర్వతమునందు మృగములుగను, శరద్వీపమునందు చక్రవాకపక్షులుగను, మానససరోవరమునందు హంసలుగను జన్మించినవారై తరువాత కురుక్షేత్రమునందు బ్రాహ్మణులయి జన్మించి సాంగముగ వేదములు చదివి వచ్చినమీరు లోకకల్యాణార్థము ఆదర్శభూతులయి వెలయుచుండుఁడు.

౩. యోగదృష్టిగలవారును, ధ్యానశీలురును, తేజోవంతులును అగుమూర్తామూర్తపితరులకు ఎల్లప్పుడు నమస్కరించుచున్నాఁడను.

౪. ఆశ్రావయ, అస్తు శ్రౌషట్, యజ, ఏయజామహే, వషట్, అనుమంత్రములతో సంపుటిచేసి ఎవనినిగూర్చి హోమము జరుపఁబడుచున్నదో అట్టి శ్రీమహావిష్ణువు ప్రసన్నుఁడగుఁగాక.

౫. ఇచ్చుపట్టిహవిస్సు బ్రహ్మము. అగ్ని బ్రహ్మస్వరూపము. అర్పించువది బ్రహ్మమునకు. ఇట్టిదృఢభావనతో నెవ్వఁడు వైదికకర్మ మాచరించునో వానికి బ్రహ్మప్రాప్తి కలుగును.

౬. నాశరహితుఁడను శ్రీమహావిష్ణువే సకలహవ్యకవ్యభోక్తయు, యజ్ఞేశ్వరుఁడును అగుచున్నాఁడు. అతనిసన్నిధానమువలన ఇప్పుడు ఈప్రదేశమునందుఁగల సకలరాక్షసులు, అసురులును వెళ్ళిపోవుదురుగాక.

౭. ఓపరమేశ్వరా! నిన్ను యోగీశ్వరులు తలంచుచుందురు. యజ్వలు నిన్నుఁగూర్చి యాగము లొనర్చుచున్నారు. పితృదేవస్వరూపముల ధరించి కవ్యమును హవ్యమును భుజించువాఁడవు నీ వొక్కఁడవే.

౮. కర్మముల నాచరించువాఁడువిష్ణువు. అతఁడే పూజింపఁబడుచున్నాఁడు. యాగమున్నూ అతఁడే. యాగముయొక్కఫలమున్నూ అతఁడే. స్రుక్కు స్రువము మున్నగుయజ్ఞ సాధనలన్నియు విష్ణుస్వరూపములే. విష్ణువుకంటె భిన్నమయిన పదార్థ మేదియును లేదు.

౯. గయయందును, ధర్మపృష్ఠమునందును, బ్రహ్మణస్పతిసభయందును, గయాశీర్షమునందును, అక్షయవటచ్ఛాయయందును పితరుల నుద్దేశించియిచ్చినది అక్షయ్యమగును.

☞ ధర్మపృష్ఠమున్నగునవి గయాక్షేత్రమునందుఁ గల పవిత్రస్థలములు.

౪౦. రుద్రుఁడు, విష్ణువు, బ్రహ్మ, సుబ్రహ్మణ్యస్వామి, గార్హపత్య--ఆహవనీయదక్షిణాగ్నులను అగ్నిత్రయము, సూర్యుఁడు, చంద్రుఁడు, గణేశ్వరుఁడు, క్రౌంచుఁడు, దేవేంద్రుఁడు, అగస్త్యుఁడు, కశ్యపుఁడు, అనువీరియొక్క పాదములను, పితరులకు ముక్తిని ఇచ్చుటకు సమర్థమయినవానిని ఎల్లప్పుడును నమస్కరించుచున్నాఁడను.

౪౧. * (నమో...భ్యః॥ తై. ఆ. ౧౦.౨.) దేవేభ్యః = దేవతలకొఱకు; నమః = నమస్కారము (అని ప్రాఙ్ముఖుఁడయి విశ్వేదేవబ్రాహ్మణునకును) పితృభ్యః = పితృదేవతలకొఱకు, స్వధా = (పితృప్రీత్యర్థము స్వధాకారముతో) నమస్కారము. (అని పితృస్థానీయబ్రాహ్మణునకును నమస్కారము.)

౪౨. * (ఓంతత్...నమః॥ తై. ఆ. ౧౦-౨౯) ఓం = ప్రణవప్రతిపాద్యమగు, తత్ = వేదాంతములచేత తెలిసికొనఁదగినవస్తువే, బ్రహ్మ = బ్రహ్మము. ఓం ప్రణవప్రతిపాద్యమగు, తత్ = ఆవస్తువే, వాయుః = వాయువు. ఓం = ప్రణవప్రతిపాద్యమగు, తత్ = ఆవస్తువే, ఆత్మా = జీవుఁడు. ఓం = ప్రణవప్రతిపాద్యమగు, తత్ = ఆవస్తువే, సర్వం = చరాచరజగత్స్వరూపమంతయు. ఓం = ప్రణవప్రతిపాద్యమగు, తత్ = ఆవస్తువే, పురః = విస్తీర్ణమగు బ్రహ్మాండమునకు కారణము. (కావున ఆవస్తువునకు) నమః = నమస్కారము.

౪౩. * (అన్త...ప్రజాపతిః॥ తై. ఆ. ౧౦-౩౧.) విశ్వమూర్తిషు = దేవమనుష్యగంధర్వాది నానావిధశరీరములతోఁగూడియున్న, భూతేషు = ప్రాణులయందు, గుహాయాం = బుద్ధిగుహయందు, ఓం = ప్రణవప్రతిపాద్యుఁడగు పరమాత్మ, చరతి = నివసించుచున్నాఁడు. (ఓపరమేశ్వరా) త్వం = నీవే, యజ్ఞః = జ్యోతిష్టోమాది యజ్ఞస్వరూపము. త్వం = నీవే, విష్ణుః = విష్ణువు, త్వం = నీవే, వషట్కారః = వషట్కారము. త్వం = నీవే, ప్రజాపతిః = దక్షుఁడు మున్నగు ప్రజాపాలకులును (అగుచున్నాఁడవు.)

౪౪. * (త్వంతదా...రోం॥ తై ఆ. ౧౦-౨౪) (ఓప్రణవమా!) త్వం = నీవే, ఆపః = జలరూపము, (నీవే) ఆపః = నదీనదసముద్రాదులయందుండు జలస్వరూపము, (నీవే) జ్యోతిః = సూర్యాదులయందుండు జ్యోతిస్సు, (నీవే) రసః = మధురాది రసస్వరూపము, (నీవే) అమృతం = అమృతస్వరూపము. బ్రహ్మ = పరబ్రహ్మముకూడ (నీవే) భూః భువః సువః = భూర్భువస్సువర్లోకములు మూఁడున్నూ, తత్ ఓం = ఆ ప్రణవప్రతిపాదితములే, (అనఁగా నదీనదసముద్రాదులును, సూర్యచంద్రాది జ్యోతిస్సులును, భూర్భువస్సువర్లోకములును అన్నియు ప్రణవస్వరూపములే అని భావము.)

౪౫. * (శ్రద్ధాయాం...త్వాయ॥ తై. ఆ. ౧౦-౬౯.) శ్రద్ధాయాం = శ్రద్ధ కలిగినదగుచుండఁగా, ప్రాణే = (శరీరగతములగు ౫ వాయువులలో మొదటిదగు ప్రాణవాయువునందు, నివిష్టః = ఆదరముగలవాఁడనై, అమృతం = అమృతముతో సమానమయిన ఈహవిస్సును, జుహోమి = హోమముచేయుచున్నాఁడను. శ్రద్ధాయాం = శ్రద్ధకలిగినదగుచుండఁగా, అపానే = అపానమను పేరుగల రెండవవాయువునందు, నివిష్టః = ఆదరముగలవాఁడనై, అమృతం జుహోమి = అమృతముతో సమానమయిన ఈహవిస్సును హోమము చేయుచున్నాఁడను. శ్రద్ధాయాం = శ్రద్ధకలిగినదగు చుండఁగా, వ్యానే = వ్యానమను పేరుగల మూఁడవవాయువునందు, నివిష్టః = ఆదరముగలవాఁడనై, అమృతం జుహోమి = అమృతములో సమానమయిన హవిస్సును హోమము చేయుచున్నాఁడను. శ్రద్ధాయాం = శ్రద్ధకలిగినదగుచుండఁగా, ఉదానే = ఉదానమను ౪వవాయువునందు, నివిష్టః = ఆదరముగలవాఁడనై, అమృతం జుహోమి = అమృతమువంటిహవిస్సును హోమము చేయుచున్నాఁడను. శ్రద్ధాయాం = శ్రద్ధకలిగిన దగుచుండఁగా, సమానే = సమానమను ౫ వవాయువునందు, నివిష్టః = ఆదరముగలవాఁడనై, అమృతం జుహోమి = అమృతమువంటి హవిస్సును హోమము చేయుచున్నాఁడను, మే = నాయొక్క, ఆత్మా = జీవుఁడు, అమృతత్వాయ = మోక్షముకొఱకు, బ్రహ్మణి = పరబ్రహ్మమునందు, (ఐక్యమగుఁగాక.)

౪౬. * (ఓంభూర్భువ...యాత్॥ తై. ఆ. ౧౦. ౩౫.) భూః భువః సువః ఓం = ఓంకార ప్రతిపాద్యుఁడును, భూర్భువస్సువర్లోకాంతర్యామియునగు, యః = ఏదేవుఁడు, నః = మాయొక్క, ధియః = బుద్ధివృత్తులను, ప్రచోదయాత్ = (ఆయాకృత్యముల నొనర్చుటకు) ప్రేరేపించుచున్నాఁడో, తత్ = అట్టి, సవితుః = సర్వాంతర్యామియై ప్రేరకుఁడగు, దేవస్య = పరమేశ్వరునియొక్క, వరేణ్యం = అతిశ్రేష్ఠమయిన, భర్గః = తేజస్సును, ధీమహి = ధ్యానముచేయుచున్నారము.

౪౭. * (సత్యం...మి॥ తై. బ్రా. ౨-౧-౧౧) (ఓయన్నమా!) సత్యం = సత్యస్వరూపమయిన, త్వా = నిన్ను, ఋతేన = యథార్థకథనరూపమగు ఋతముచేత, పరిషించామి = పరిషేచనము చేయుచున్నాఁడను.

౪౮. ౪౯. (చూ. ౪౬. ౪౭.)

౫౦. * అమృతం = (పితరులఁగూర్చియు, దేవతలఁగూర్చియు అపోశనార్థమియ్యఁబడిన యీయుదకము) అమృతముతో సమానమయినది, అస్తు = అగుఁగాక.

☞ ఈప్రదేశము గయాక్షేత్రమే యనియు, ఈబ్రాహ్మణోత్తములు, గదాధర

దేవస్వరూపులనియు, పితృరూపియగు శ్రీమహావిష్ణువు తృప్తిచెందుఁగాక యనియు, నే నొనర్చినది అంతయు బ్రహ్మార్పణ మగుఁగాక యనియు తాత్పర్యము.

౭౧. * (శ్రద్ధాయాం...తత్వాయ॥ తై. ఆ. ౧౦-౬౯.) చూ. ౭౫. ఆమంత్రమునందు లేని వాక్యములకుమాత్ర మర్థమిచట వ్రాయఁబడును. శ్రద్ధాయాం ప్రాణే నివిష్టః అమృతం జుహోమి = (అర్థము గతము.) శివః = (హోమము చేయఁబడిన యో పదార్థమా! నీవు) శాంతమైనదానవై, అప్రదాహాయ = ఆఁకలిచేత కలిగినదాహము నశించుటకుఁగాను, మా = నన్నుఁగూర్చి, విశ = ప్రవేశించుము. ఈహుత మొనర్పఁబడిన పదార్థము, ప్రాణాయ = ప్రాణదేవతకొఱకు, స్వాహా = సుహుతమగుఁగాక. అపానాయస్వాహా = అపానదేవతకొఱకు సుహుతమగుఁగాక. వ్యానాయస్వాహా = వ్యానదేవతకొఱకు సుహుతమగుఁగాక. ఉదానాయస్వాహా = ఉదానదేవతకొఱకు సుహుతమగుఁగాక. సమానాయస్వాహా = సమానదేవతకొఱకు సుహుతమగుఁగాక.

౭౨. * (చూ. ౭౬.)

౭౩. * (మధు...భవంతు నః॥ తై. సం. ౪. ౨. ౯) ఋతాయ తే = (పితృయజ్ఞమును శ్రద్ధాపూర్వకముగ నాచరింపవలయునని) తలంచునట్టి నాకొఱకు, వాతాః = వాయువులు, మధు క్షరంతు = మధురముగా వీచుఁగాక. సింధవః = సముద్రములున్ను, మధు క్షరంతు = మధురరసమును స్రవించుఁగాక. ఓషధీః = ఓషధులు, మాధ్వీః = మధురరసములు గలవి, భవంతు = అగుఁగాక. నక్తం = రాత్రియందు, మధు = మధువు మాకు కలిగియుండుఁగాక. ఉత ఉషసి = మఱియు ప్రాతఃకాలమునందు, మాకు మధురరసము కలిగియుండుఁగాక. పార్థివం రజః = భూమిసంబంధమయిన ధూళియంతయు, మధుమత్ = సుఖమును కలుగఁజేయునదియై యుండుఁగాక. పితా = మాకు పితృస్థానీయమగు ద్యులోకము, మధు అస్తు = మధురమయి యుండుఁగాక. వనస్పతిః = అశ్వత్థాదివృక్షసముదాయము, నః = మాకుఁగాను, మధుమాన్ = మాధుర్యరసోపేతమై యుండుఁగాక. సూర్యః = సూర్యుఁడున్ను, మధుమాన్ = మాధుర్యముగ (అనఁగా సంతాపము కలుగఁజేయక సౌమ్యుఁడయి) యుండుఁగాక. నః = మాయొక్క, గావః = ఆవులు, మాధ్వీః = మాధుర్యరసముగల క్షీరములు గలవి యగుఁగాక.

౭౪. ౧. ప్రాణులయొక్క అంతఃకరణములయందున్న శ్రీకృష్ణభగవానుఁడు ఈకలికాలమునందు సంభవించినట్టియు, ద్రవ్యమునకు, దేహమునకు, మనస్సునకు సంభవించినట్టియు సకలదోషములను నశింపఁజేయుఁగాక.

౨. మంత్రములు పఠించునప్పుడు గాని, క్రియల నాచరించునప్పుడుగాని శ్రీ మహావిష్ణువును స్మరించుచు ఏకర్మము చేయఁబడునో ఆకర్మము సఫలమగును.

౩. ఓ బ్రాహ్మణోత్తములారా! శక్తికొలఁది సమకూర్చి మీపాత్రములందు నేను వడ్డించినపదార్థములలో మీ కెయ్యది ఇష్టమయి యున్నదో ఆపదార్థమును అడుగుఁడు. మీకు ఇష్టముకానిపదార్థములున్నయెడల వానిని, పరిహరింపుఁడు. స్వస్థచిత్తులరయి కూర్చుండి సుఖముగా భుజింపుఁడు అని యజమానుఁడుభోక్తృబ్రాహ్మణులను ప్రార్థించవలయును.

౮౫. * యదశ్వస్య...ష్వస్తు. తై. సం. ౪.౬.౮.

అధిశ్రవణము:—యజుస్సంహితయందుఁగల పితృమహిమను దెలిపెడిమంత్రములను సేకరించి అధిశ్రవణ మని పేరిడినారు. గ్రంథవిస్తరభీతిచేత ప్రతిమంత్రమునకు అర్థము వ్రాయఁదలఁచలేదు. ఆయాయనువాకము లెందులకు సంబంధించినదియు ఇచట సంగ్రహముగ వ్రాయుచున్నారము.

౧. "యుంజతే మన ఉతయుంజతే" (తై. సం. ౧-౨-౧౩) అను, ౧వఅనువాకము విష్ణుమహిమను తెలుపునట్టిది.

౨ "కృణుష్వపాజః" (తై. సం. ౧-౨-౧౪) అను ౨ వయనువాకము రక్షోఘ్నమంత్రములుగలది.

౩. "రక్షోహణోవలగహనః" (తై. సం. ౧-౩-౨) అను ౩ వ యనువాకముకూడ రక్షోఘ్నమంత్రములుగలది.

౪. "సోమాయ పితృమతే" (తై. సం. ౧-౮-౫) అను ౪ వ యనువాకము పిండపితృయజ్ఞమునుగూర్చి వివరించును. దీనియొక్క బ్రాహ్మణము. తై. బ్రా. ౧-౬-౮ అనువాకము.

౫. "ఉశంతస్త్వాహవామహే" (తై. సం. ౨-౬-౧౨) అను ౫ వ యనువాకము పితృమహిమనుగూర్చి తెలుపును.

౬. "భక్షేహిమావిశ" (తై. సం. ౩-౨-౫) అను ౬ వ యనువాకముకూడ పితృమహిమనుగూర్చి తెలుపును.

౭. "ధ్రువాఽసి ధరుణాఽస్తృతా" (తై. సం. ౪-౨-౯) అను ౭ వ యనువాకము, పితృమహిమను తెలుపునది.

౮. "ఆశుశ్శిశానః" (తై. సం. ౪-౬-౪) అను ౮ వ యనువాకము అప్రతిరథానువాక మను పేరుతో దేవతాజయప్రతిపాదకమయి యున్నది.

౯. "ఉదేనముత్తరాం" (తై. సం. ౫-౪-౬) అను ౯ వ యనువాకము వెనుక చెప్పిన 'ఆశుశ్శిశానః' అను అనువాకమునకు వినియోగబ్రాహ్మణము.

౧౦. "అగ్న ఉదధే" (తై. సం. ౫-౫-౯) అను ౧౦ వ యనువాకము చయన ప్రకరణమునకు సంబంధించినది.

౧౧. "శిరోవా ఏతద్యజ్ఞస్య" (తై. సం. ౬-౨-౧౧) అను ౧౧ వ యనువాకము ఈయధ్ధిశ్రవణమునందు 3 వ యనువాకముగా చెప్పఁబడిన 'రక్షోహణోవలగహనః' అను అనువాకమునకు బ్రాహ్మణము.

౧౨. "అసావాదిత్యోఽస్మిన్" తై. సం. ౭-3-౧౦) అను ౧౨ వ యనువాకము రాక్షసుల సంహారమునుగూర్చి తెలుపునది, పితృమహిమను తెలుపునవి, విష్ణుపరాక్రమమును ఉగ్గడించునవి, అప్రతిరథానువాకముగలవి అధిశ్రవణమునఁబడును.

౨౫. (చూ. సంఖ్య. ౨౨) ౨౬. (చూ. సంఖ్య ౨౩.)

౨౭. నాపితరులలో ఎవరికి దహనాదిసంస్కారములు యథాశాస్త్రముగ జరుగలేదో, ఏకుల స్త్రీలు భర్తలచేత వదలఁబడియున్నారో, అట్టివారి తృప్తికొఱకు ఈవికిరాన్నమును ఉంచుచున్నాఁడను.

౨౮. దేవతలలో ఎవరికి యజ్ఞభాగముగాని, సోమపానార్హతగాని లేదో అట్టిదేవతలకొఱకు విశ్వేదేవసంబంధమయిన ఈవికిరాన్నము నొసంగుచున్నాఁడను.

౨౯. నావంశమునందు జన్మించి దైవగతి నందినవారిలో ఎవరు యథాశాస్త్రముగ దహనాదిసంస్కారముల నందినారో, ఎవరు అట్టిసంస్కారముల నందలేదో అట్టివారు నే నిప్పు డుంచినవికిరపిండముచేత సంతృప్తులయి ముక్తిని పొందెదరుగాక.

౩౦. యజమానునివంశమునందు జన్మించి మృతిచెందిన దాసదాసీజనాదులలో ఎవరు అన్నమునభిలషించుచున్నారో, వారందఱు నేను భూమియం దుంచిన యీయన్నముచేత తృప్తినందెదరుగాక.

౩౧. (ఓయుదకమా! నీవు) అమృతాపిధానం = నాశములేని యాచ్ఛాదనము వంటిదానవు, అసి = అగుచున్నావు.

౩౨. పాపాత్ములకు నివాసభూతమగు రౌరవనరకమునందు పద్మార్బుదసంఖ్యగల సంవత్సరముల కాలమునుండి నరకబాధ ననుభవించుచున్నవారును, జలపానాభిలాషులునుయగువారి తృప్తికొఱకు ఈయుదకము ఇయ్యఁబడినది. ఈజలము అక్షయ్యమగుఁగాక.

౯౩. * (శ్రద్ధాయాం...య॥ తై. ఆ. ౧౦. ౩౬.) ౧. శ్రద్ధాయాం = వైదికకర్మములయందు విశ్వాసాతిశయము కలదగుచుండఁగా, ప్రాణే = ప్రాణ వాయువునందు, నివిశ్య = ఆదరాతిశయమునుంచి, అమృతం = నశించనట్టిదియు, రుచి కలిగినట్టిదియు అగు (ఈహవిస్సు) హుతం = హుతముచేయఁబడినది. (ప్రాణవాయ్వభిమానివగు ఓదేవీ! నీవు) ప్రాణం = ముఖనాసికా సంచారియగు ప్రాణవాయువును, అన్నేన = నేను హుతమొనర్చిన యన్నముచేత, ఆప్యాయస్వ = వృద్ధి పొందింపుము.

౨. శ్రద్ధాయాం = వైదిక కర్మములయందు విశ్వాసాతిశయము కలదగుచుండఁగా, అపానే = అపాన వాయువునందు, నివిశ్య = ఆదరాతిశయముంచి, అమృతం = నశించనట్టిదియు, రుచిగలట్టిదియు అగు ఈహవిస్సును, హుతం = హుత మొనర్చినాఁడను, (అపానవాయ్వభిమానినివగు ఓదేవీ! నీవు) అపానం = అపానవాయువును, అన్నేన = హుతమొనర్చిన యన్నముచేత, ఆప్యాయస్వ = వృద్ధిపొందింపుము.

౩. శ్రద్ధాయాం = వైదికకర్మములయందు శ్రద్ధాతిశయము కలిగి యుండఁగా, వ్యానే = వ్యానవాయువునందు, నివిశ్య = ఆదరాతిశయము కలిగి, అమృతం = అమృతమువంటి యీపదార్థము, హుతం = హుతమొనర్పఁబడెను. (వ్యానవాయ్వభిమానినివగు ఓదేవీ! నీవు) వ్యానం = వ్యాన వాయువును, అన్నేన = అన్నముచేత, ఆప్యాయస్వ = తృప్తిని పొందింపుము.

౪. శ్రద్ధాయాం = వైదిక కర్మముల యందు శ్రద్ధకలిగియుండఁగా, ఉదానే = ఉదానవాయువునందు, నివిశ్య = ఆదరాతిశయముంచి, అమృతం = అమృతమువంటి హవిస్సు, హుతం = హుతమొనర్పఁబడినది. (ఉదానవాయ్వభిమానినివగు ఓదేవీ! నీవు) ఉదానం = ఉదానవాయువును, అన్నేన = భుజించిన యీయన్నముచేత, ఆప్యాయస్వ = వృద్ధిని పొందింపుము.

౫. శ్రద్ధాయాం = వైదిక కర్మములయందు శ్రద్ధకలిగి యుండఁగా, సమానే = సమానవాయువునందు, నివిశ్య = ఆదరణబుద్ధిగలిగి, అమృతం = నశించని రుచిగల యీహవిస్సు, హుతం = హుతమొనర్పఁబడినది. (సమానవాయ్వభిమానినివగు ఓదేవీ! నీవు) సమానం = సమానవాయువును, అన్నేన = అన్నముచేత, ఆప్యాయస్వ = వృద్ధిని పొందింపుము.

౯౪. * (ప్రాణానాం...స్వా॥ తై. ఆ. ౧౦.౭౪) (హృదయకుహరాంతర్వర్తియగు ఓ అహంకారమా ! నీవు) ప్రాణానాం = వాయురూపములును, ఇంద్రియరూపములును అగు ప్రాణములకు, గ్రంథిః = (వదలిపోకుండుటకుఁగాను వేసిన) ముడివంటి వాఁడవు, అసి = అయితివి. (అట్టి) రుద్రః = (అహంకారాభిమాని దేవతయగు) రుద్రరూపుఁడవగు (నీవు) అంతకః = దుఃఖ వినాశకుఁడవయి, మా =

నాశరీరమును, విశ = ప్రవేశింపుము, తేన = ఆ, అన్నేన = (నేనుతినిన) అన్నము చేత, ఆప్యాయస్వ = నన్ను వృద్ధిని పొందింపుము. తా. నాహృదయమునందు అహంకారాభిమాని దేవతవై యుండు ఓరుద్రుఁడా! నీయనుగ్రహముచేత నే నాశరీరమునందుండు ప్రాణాదిపంచవాయువులు విడిపోక యున్నవి. అట్టినీవు నాకు వచ్చినట్టియు రాఁబోవునట్టియు సకలదుఃఖములను నశింపఁజేయుము. నేను భుజించిన యీ యన్నముచేత నాకు వృద్ధి కలుగునటు లనుగ్రహింపుము.

౯౫. * (నమో...పాహి॥ తై. ఆ. ౧౦-౭౫.) రుద్రాయ = (పార్వతీపతియగు) రుద్రునికొఱకును, విష్ణవే = (లక్ష్మీపతియగు) విష్ణువుకొఱకును, నమః = నమస్కారము (అగుఁగాక) (ఓరుద్ర విష్ణువులారా!) మే = నన్ను, మృత్యోః = మృత్యువునుండి, పాహి = కాపాడుఁడు. (ఓరుద్ర విష్ణువులారా! మీకు నమస్కారము. మీయనుగ్రహమువలన నాకు అపమృత్యువు లేకపోవుఁగాక.)

౯౬. * (అంగుష్ఠ...భుక్॥ తై. ఆ. ౧౦. ౭౧.) పురుషః = జీవరూపుఁడగు పురుషుఁడు, అంగుష్ఠమాత్రః = తనబొటనవ్రేలంత కొలతగలవాఁడై యున్నాఁడు. అంగుష్ఠంచ = అంగుష్ఠము మొదలుకొని శిరస్సువఱకును, సమాశ్రితః = ఆశ్రయించియున్నాఁడు. (ఆపురుషుఁడు) సర్వస్య = సమస్తమయిన, జగతః = జగత్తునకు, ఈశః = నియామకుఁడు (కావుననే) విశ్వభుక్ = సర్వము ననుభవించువాఁడు. అట్టి, ప్రభుః = ప్రభువు, ప్రీణాతి = (ఈ భోజనముచేత) సంతుష్టుఁడగుఁ గాక.

☞ ఈ ౯౩, ౯౪, ౯౫, ౯౬, సంఖ్యగల మంత్రములను ప్రతినిత్యము బ్రాహ్మణు లందఱు భోజనానంతరము చేతులు కాళ్ళుకడుగుకొన్న తర్వాతకూర్చుండి పఠించి తీరవలయును. ఈమంత్రార్థమును హృదయమునం దెఱింగి ఈమంత్రముల పఠించుబ్రాహ్మణుని యానందమునకు మేర యుండదు గదా. శ్రాద్ధాదులందు భోక్తృబ్రాహ్మణులుమాత్రమే పఠింపఁదగినవి యీమంత్రము లని కొందఱుఅజ్ఞానముచేత భావించుచుండుటచేత ఇట్లు వ్రాసినారము.

౯౭. * (అపాం...శతం॥ ఆప. శ్రౌ. ౧. ౫. ౫.) మేధ్యం = పవిత్రమైనట్టియు, యజ్ఞియం = యజ్ఞమునకు యోగ్యమయినట్టియు, సదేవం = దేవాస్తరణమునకు యోగ్యమయినట్టియు, అపాం = ఉదక (సారభూత) మైన యీదర్భ, మే = నాకు, శివం = శుభముకలుగఁ జేయునది, అస్తు = అగుఁగాక. (ఓదర్భలారా! నేను) వః = మిమ్ములను, అచ్ఛేత్తా = ఛేదించిన వాఁడనైనప్పటికిన్ని, మారిషం = హింసించినవాఁడను కాకపోవుదును గాక. శతం శరదః = నూఱు సంవత్సరములు, జీవాని = జీవించి యుందును గాక.

౯౮. * (అప...షదః॥ వా.సం. ౨౨.౯.) వేదిషదః = (నేను పితృపిత్యర్థము చేయుచున్న ఈ (శ్రాద్ధముయొక్క) వేదికయందు, అనఁగా ఈప్రదేశమునందుఁగల, అసురాః = అసురులున్నూ, రక్షాంసి = రాక్షసులున్ను, పిశాచాః = పిశాచములున్నూ, అపహతాః = ఇచటనుండి తొలఁగిపోవుఁగాక.

౯౯. * (ఆయంతు...సః॥ ఆప. శ్రౌ. ౧-౭-౧౩) మనోజవసః = మనోవేగముతో సమానమయిన వేగముగల, పితరః = పితృదేవతలు, ఆయంతు = ఇచటికి వచ్చెదరుగాక.

౧౦౦. * (సకృదాచ్ఛిన్నం...స్వహా॥ తై. బ్రా. ౩. ౭. ౪.) సకృదాచ్ఛిన్నం = ఒకటేపర్యాయముగ కోయఁబడినట్టియు, ఊర్ణామృదు = పట్టువలె మృదువుగా నున్నట్టియు, స్యోనం = సుఖకరమయిన, బర్హిః = ఓదర్భ! త్వా = నిన్ను, పితృభ్యః = పితృదేవతలకొఱకు, అహం = నేను, ఆధరామి = పఱచుచున్నాను. అస్మిన్ = (పితరుల నిమిత్తము భూమియందు పఱచిన) యీదర్భలయందు, సోమ్యాః = సోమపానార్హులయినట్టి, లేక, మంచి మనస్సుగల, మే = నాయొక్క, పితరః, పితామహాః, ప్రపితామహాః = పితృ, పితామహ, ప్రపితామహులు, అనుగైస్సహచ = తమ సేవకులతోడ, సీదంతు = (వచ్చి) నివసింతురుగాక.

౧౦౧. * (అత్ర...ధ్వం॥ తై. సం. ౧-౮-౫) పితరః = ఓపితృదేవతలారా! మీరు, అత్ర = ఇచ్చట, యథాభాగం = మీమీభాగమునకు తగినట్లు, మందధ్వం = తృప్తిని పొందెదరుగాక.

౧౦౨. ౧౦౩. ౧౦౪. * (అమీమదంత...పితరః॥ తై. సం. ౧-౮-౫) పితరః = పితృదేవతలు (మమ్ములను) అమీమదంత = సంతోషపెట్టుదురుగాక, పితరః = పితృదేవతలు, అతీతృపంత = తృప్తినిపొందింపఁజేయుదురుగాక. పితరః = పితృదేవతలు, అమీమృజంత = (మమ్ములను) పరిశుద్ధులనుగాఁ జేసెదరుగాక.

౧౦౫.౧. * (యేసమానాః...కల్పతాం॥ తై. బ్రా. ౧-౬-౨.) యమరాజ్యే-యమలోకమునందు (ఉన్న) యే = ఏ, పితరః = పితరులు, సమానాః = నాతోసమానమయిన స్వభావము గలవారలుగాను, సమనసః = సమానమయిన మనస్సుగలవారలుగను, (ఉన్నారో) తేషాం = అట్టిపితరులయొక్క, లోకః = లోకము నాకు కలుగుఁగాక. (ఆపితరులకొఱకు) స్వధా = స్వధాకార మియ్యఁబడినది. నమః = నమస్కారము చేయఁబడినది. యజ్ఞః = ఈనాచే చేయఁబడిన పితృయజ్ఞము, దేవేషు = పితృదేవతలయందు, కల్పతాం = తృప్తిని కలుగఁజేయునది యగుఁగాక.

౧౦౫. ౨. * (యేసజాతాః...సమాః॥ తై. బ్రా. ౧-౬-౨.) జీవేషు = జీవులయందు, మామకాః = నాసంబంధులయిన, యే = ఏ, జీవాః = జీవులు సజా

తాః=(సహోదరరూపమున) నాతోకూడ పుట్టినారో, సమనసః=(నాతో) సమానమయిన మనస్సుగలవార లెవరో, తేషాం=వారియొక్క, శ్రీః=ధనముమున్నగు సంపత్తు, మయి=నాయందు, కల్పతాం=ఉండుఁగాక. (అనఁగా వారు నాయధీనముగా నుండవలయును.) అస్మిన్ లోకే=ఈలోకమునందు, శతం సమాః=(నాయొక్క-ఆయుర్దాయము) నూఱు సంవత్సరములుగలది (అగుఁగాక.)

౧౦౬.*(వీరం...రః॥ఆ. ప. శ్రౌ. ౧-౯-౧౨.)పితరః=ఓపితృదేవతలారా! వీరం=వీరుఁడగు పుత్రుని, ధత్త=నాకొఱకు సంపాదింపుఁడు. అనఁగా వీరుఁడగు పుత్త్రుని నాకు అనుగ్రహింపుఁడు.

౧౦౭,౧౦౮,౧౦౯,౧౧౦. (౭౬,౭౭,౭౮,౭౯,౮౦. సంఖ్యలు చూడుఁడు.)

౧౧౧ * (ఊర్జం...తృప్యత॥ వా. సం. ౨. ౩౪. ఆప. శ్రౌ. ౧.౧౦. ౪) ఊర్జం=అన్నరసమును, ఘృతం=ఆజ్యసారమును, పయః= క్షీరసారమును, అమృతం=అమృతమును, కీలాలం=బంధనివారకమయిన, పరిస్రుతం=(పుష్ప) రసమును, వహంతీః=వహించుచున్న ఓయుదకములారా!, (మీరు) స్వధా=పితరుల కొసంగుహవిస్సుయొక్క రూపములయి యున్నారు. మే=నాయొక్క, పితౄన్=పితృదేవతలను,తర్పయత=తృప్తిని పొందింపుఁడు. (ఓపితృదేవతలారా ఈయుదకదానముచేత మీరు) తృప్యత=తృప్తిని పొందుఁడు.

౧౧౨. * (తై. సం ౩.౨.౫.చూ. ౩౯ సంఖ్య)

౧౧౩. * (మనోన్వాహూ...సచేమహి॥ తై. సం. ౧. ౮. ౫) నారాశంసేన=మనుష్య ప్రశంసాయోగ్యమయిన, స్తోమేన = వాక్యసమూహముచేతను, పితౄణాం=పితృదేవతలయొక్క, మన్మభిః=స్మరింపఁదగిన వాక్యములతోడను (కూడుకొనియున్న) మనః=(పితృదేవతా పూజాసక్తిగల) చిత్తమును, ను=శీఘ్రముగా, ఆహువామహే=పిలుచుచున్నారము. మనః=(పితృదేవతా పూజాదికమునందు ఆసక్తిగల) మనస్సు, క్రత్వే=సత్కర్మముల నాచరించుకొఱకును, దక్షాయ = (ఆయాకర్మముల నాచరించుటకు తగిన) సామర్థ్యముకొఱకును, జీవసే=(చిరకాలము సుఖముగా) జీవించుకొఱకును, జ్యోక్=చిరకాలము జీవించుచు, సూర్యం=సూర్యుని, దృశే=చూచుకొఱకును, పునః=పలుసారులు, నః=మమ్ములను, ఆ ఏతు=పొందుఁగాక, పితరః=ఓపితృదేవతలారా! దైవ్యః=దేవతాసంబంధమయిన, జనః=జనసముదాయము, పునః=అనేకపర్యాయములు, నః=మాకు, మనః=(పితృపూజాసక్తిగల) మనస్సును, దదాతు=ఇచ్చుఁగాక.(మేము) వ్రాతం=అనేకసంవత్సర సమూహకాలాత్మకమగు, జీవం=జీవనమును, అనఁగా ఆయుస్సును, సచేమహి=పొందెదముగాక. (తా. నా పెద్దలగువారలను కొని

యూడుట యందును, పితరుల పూజించుటయందును, నామనస్సు లగ్నమయి యుండుఁ గాక. ఆయాసత్కర్మముల ననుష్ఠించుటకు తగినసామర్థ్యము, దీర్ఘాయుస్సు మాకు కలిగియుండుఁగాక. పితృదేవతలారా! మీయనుగ్రహమువలన మేము సత్కర్మానుష్ఠానాసక్తిగలవారలమయి చిరకాలము జీవించి యుందుముగాక.)

౧౧౪. * (పరేత...మదంతి॥ తై. సం. ౧. ౮. ౫.) సోమ్యాః = సౌమ్యులగు, పితరః = ఓ పితరులారా! గంభీరైః = అన్నోదకములు సులభముగ లభించు, పూర్వ్యైః = మునుపు చేయఁబడిన, పథిభిః = మార్గములతో, పరేత = గృహమునకు రండు, అథ = (గృహమును చేరిన) పిమ్మట, యమేన = యమధర్మరాజుతోడ, యే = ఏపితరులు, సధమాదం = కలసి కూర్చుండుటయను సంతోషమును పొంది, మదంతి = సంతసించుచున్నారో, అట్టి, సువిదత్రాన్ = చిరకాలము నివసించుటచేత అన్నివిషయములను చక్కఁగా నెఱింగిన, పితౄన్ అపి = పితరులనున్ను, ఇత = మీరు పొందుఁడు.

౧౧౫. ౧. అయోధ్య, మథుర, అనఁగా ఉత్తరదేశమునందుఁగల మథుర శ్రీకృష్ణునిజన్మస్థానము, మాయ యనఁగా హరిద్వారము, కాశి, కాంచి, అవంతిక అనఁగా ఉజ్జయని, ద్వారక యను ఈ ఏడు పట్టణములును మోక్షము నొసంగును.

౨. దేశకాలసౌకర్యాద్యభావముచేత నెవ్వఁడు కాశీయాత్రకు వెంటనే వెళ్ళలేకపోయినను "నేను కాశీక్షేత్రమునకు పోఁగలను. అచ్చటనే నివసించఁగల" నని ఎల్లప్పుడు పలుకుచుండునెడల వానికి కాశీవాసఫలము లభించును.

౩. గయాసురుని శిరస్సగు గయాక్షేత్రమునం దెవ్వఁడు పితరుల నుద్దేశించి జమ్మియాకంత పిండమును పెట్టినను వారియొక్క సప్తగోత్రములకు చేరిన ౧౦౧ తరములకు చేరినపితరులున్నూ ఉద్ధరింపఁబడుదురు.

సప్తగోత్ర, ఏకోత్తరశతకుల వివరము.

| | | | |
|---|---|---|---|
| ౧. | పితృకులము :— | ౨౧ | తరములు. |
| ౨. | మాతృకులము :— | ౨౧ | ,, |
| ౩. | జామాతృ(అల్లుని)కులము :— | ౧౨ | ,, |
| ౪. | పితృభగిని (మేనత్త)కులము:— | ౧౨ | ,, |
| ౫. | మాతృభగిని(పినతల్లి పెత్తల్లుల)కులము | ౧౦ | ,, |
| ౬. | ఆత్మభగిని(తనతోఁబుట్టువు)కులము | ౧౦ | ,, |
| ౭. | శ్వశుర (మామ)కులము:— | ౧౫ | ,, |

మొత్తము ౧౦౧ కులములు.

ప్రమాణశ్లోకములు :—గరుడపురాణ ప్రేతకాండ ౧౩ అధ్యాయము.

౧౧౬. *(అగ్నే...ఓహైః॥ తై. సం.౪-౪-౪)అగ్నే = ఓయగ్నీ! అద్య= ఇప్పుడు,. ఈపితృయజ్ఞమునందు, హృదిస్పృశం = మనోహరుఁడవయిన, తం = ఆనిన్ను, తే = నీయొక్క, స్తోమైః = స్తుతిరూప మంత్రములచేత,అశ్వంన = (శ్వేతకపువు మున్నగువాని నిచ్చి) గుఱ్ఱమును వలెను, భద్రం = మంగళకరమగు, క్రతుంన = జ్యోతిష్టోమాదియాగమునువలెను, (తా. ప్రీతిపాత్రమగు అశ్వమునకు తగినయాహారమిచ్చి,ఎటులుపోషించెదరో, సద్గతిని కలుగఁజేయు జ్యోతిష్టోమాది క్రతువులనెట్లు భక్తితో నాచరింతురో ఆట్లే నిన్ను నేను స్తుతిచేయుచున్నాఁడను.)

౧౧౭. * (యదంతరిక్షం...సమ్॥ తై. సం. ౧-౮-౫-౩) అంతరిక్షం = అంతరిక్షలోకమును, పృథివీం = భూలోకమును, ద్యాం = స్వర్గలోకమును, జిహింసిమ (ఇతి)యత్ = హింసచేయవలయునని యిచ్ఛయించినది యెయ్యదిగలదో, ఉత = మఱియు, మాతరం = తల్లిని, పితరంవా = తండ్రినిగాని, జిహింసిమఇతియత్ = హింసచేయవలయునని యిచ్ఛయించినది యెయ్యదిగలదో, తస్మాత్ = అట్టిసంబంధముగల, అ, ఏనసః = పాపమునుండి, గార్హపత్యఃఅగ్నిః = గార్హపత్యాగ్ని, మా = నన్ను ప్రముంచతు = వదలునట్లుచేయుఁగాక. యానిచ = (ఇతరములగు) ఏ,దురితా = పాపములను, చకృమ = చేసినాఁడనో, (ఆపాపములనుండి నన్ను విడిపించుఁగాక.) మాం = నన్ను, అనేనసం = సర్వవిధపాపరహితునిగ, కరోతు = చేయుఁగాక (తా. నేను అజ్ఞానముచేతఁగాని దుర్జ్ఞానముచేతఁగాని భూర్భువస్సువర్లోకములం, దున్నవారిలో ఎవరిని గూర్చికాని హింసాకరమగునెట్టి యపకారము నాచరించియున్నను, తల్లిదండ్రులను గూర్చి యెట్టిహింసాకరమగు కృత్యము నొనర్చియున్నను ఈగార్హపత్యాగ్ని నేను చేసిన అట్టిదుష్కృత్యమువలన కలిగినపాపమును పోఁగొట్టినన్ను నిష్పాపునిగా చేయుఁగాక.)

౧౧౮. కర్త:—అఘోరాః పితరః సంతు = మాపితరులు మాయందు శాంతమయిన అభిప్రాయము కలిగియుందురుగాక.

భోక్త:—మీపితరులు మీయందు సౌమ్యులయి యుందురుగాక.

కర్త:—అస్మద్గోత్రం వర్ధతాం = మావంశ మభివృద్ధి నందుఁగాక.

భోక్త:—స్వస్తి వర్ధతాం గోత్రం = మీగోత్ర మభివృద్ధి నందుఁగాక.

కర్త:—వేదాస్సంతతిరేవ నః = మాకు వేదశాస్త్రసంపత్తి, సంతానము కలిగియుండుఁగాక.

భోక్త:—వేదాస్సంతతిరేవ వః = మీకువేదశాస్త్రసంపత్తి,సంతానముకలుగుఁగాక.

కర్త:—శ్రద్ధా చ నో మావ్యగమత్ = ఆస్తిక్యబుద్ధి మాకు కలిగియుండుఁగాక.

భోక్త:—శ్రద్ధా చ వో మావ్యగమత్ = మీకు ఆస్తిక్యబుద్ధి కలిగియుండుఁగాక.

క_ర్త:—బహు దేయంచ నోఽస్తు = ఇయ్యఁదగిన పదార్థము విశేషించి మాకు ఉండుఁగాక.

భో_క్త:—బహు దేయం చ వోఽస్తు = ఇయ్యఁదగిన పదార్థము మీకువిశేషించి యుండుఁగాక.

క_ర్త:—అన్నం చ నో బహు భవేత్ = మాకు అన్నము విశేషముగ నుండుఁగాక.

భో_క్త:—అన్నం చ వో బహు భవేత్ = మీకు అన్నము విశేషముగ కలిగి యుండుఁగాక.

క_ర్త:—అతిథీంశ్చ లభేమహి = అతిథులు మాకు విశేషముగ లభించెదరుగాక.

భో_క్త:—అతిథీంశ్చ లభధ్వం = మీకు అతిథులు విశేషముగ లభించెదరుగాక.

క_ర్త:—యాచితారశ్చ నస్సంతు = మమ్ముల యాచించువా రుందురుగాక.

భో_క్త:-యాచితారశ్చ వస్సంతు = మిమ్ముల యాచించువా రుందురుగాక.

క_ర్త:-మాచ యాచిష్మ కంచన = మేము ఎవ్వరిని యాచింపక యుందుముగాక.

భో_క్త. మాచ యాచిధ్వం కంచన = మీరు ఎవ్వరిని యాచింప కుందురుగాక.

క_ర్త:-సత్యా ఏతా ఆశిషస్సంతు = ఈయాశీర్వాదములు సత్యము లగుఁగాక

౧౧౯ * (ఋచేత్వా... ధారామ్॥ తై. సం. ౪-౨-౯) ఓపరమేశ్వరా! త్వా = నిన్ను, ఋచే = స్తోత్రరూపము గుబుుక్కకొఱకు, (సేవించుచున్నాఁడను.) త్వా = నిన్ను, రుచే = కాంతికొఱకు (సేవించుచున్నాఁడను.) ధేనాః = త్రాగుటకు యోగ్యములైన పెరుగుతేనెయు, సరితోన = నదులవలె, సమిత్ = చక్కఁగా, స్రవంతి = ప్రవహించుచున్నవి, అంతః = శరీరముయొక్క లోపల, మనసా = హృదయమునందుండెడి, హృదా = అంతఃకరణముచేత, పూయమానాః = పవిత్రములయినవిగాఁజేయఁబడిన, ఘృతస్యధారాః = ఆజ్యధారలను, అభిచాకశీమి = అనుభవించుచున్నాఁడను, ఆసాంమధ్యే = ఈఘృతధారలయందు, హిరణ్యయః = సువర్ణమయమువలె తేజోరూపమయిన పురుషునియొక్క శిరస్సు, వేతసః = (ప్రవాహోదకముయొక్క మధ్యభాగమునందుండు) ప్రబ్బలిచెట్టువలె ప్రకాశించుచున్నది.

తస్మిన్ = ఆవేతసవృక్షమువలె మధ్యభాగమున ప్రకాశించుచున్న పురుషునియొక్క శిరస్సునందు, సుపర్ణః = మంచిఱెక్కలు కలిగినట్టియు, కులాయీ = స్వనివాసస్థానముతోఁగూడిన, మధుకృత్ = ఒకతుమ్మెద, దేవతాభ్యః = దేవతలకొఱకు, మధు = అమృతమును, భజన్ = సంపాదించుచు, ఆస్తే = ఉన్నది, తస్య = ఆపురుషునియొక్క, తీరే = సమీపమునందు, సప్త = ఏడయిన, హరయః = అమృతమును పరిగ్రహించెడి స్వభావముగల తుమ్మెదలు, స్వధాం = స్వధాకార

రూపమయిన భోగ్యవస్తుసముదాయమును, అమృతస్య = అమృతముయొక్క ధారను, దుహానాః = స్రవింపఁజేయుచు, ఆసతే = ఉన్నవి.

☞ "ఋచేత్వా మొదలుకొని, ధారామ్" అనువఱకు ౨. యజుస్సులు 3. ఋక్కులు. అని భాష్యమునందు వ్యాఖ్యాతమయియున్నది. చయనప్రకరణము నందు ఇష్టకోపధాన సందర్భమున ఈమంత్రములు చెప్పఁబడినవి.

౧౨౦. * (ఆమా...గమ్యాత్॥ తై. సం. ౧-౭-౫-౩) వాజస్య=అన్నము యొక్క, ప్రసవః=ఉత్పత్తి, మా=నన్నుఁగూర్చి, ఆజగమ్యాత్=వచ్చుఁగాక, ద్యావాపృథివ్యౌ=ఆకాశము భూమియు, విశ్వశంభువా=ప్రపంచమున కంతయు సుఖము కలుగఁ జేయవలయుననుతలంపు గలవై (నన్నుఁగూర్చి) (ఆజగమ్యాత్)= వచ్చుఁగాక, పితరా మాతరా= నాతలిదండ్రులు, మా=నన్నుఁగూర్చి, ఆగంతాం= (నేను చిరకాలము జీవించుకొఱకు) వచ్చెదరుగాక, సోమః=సోముఁడున్నూ, అమృతత్వాయ= నాకు దేవత్వము నొసంగుకొఱకు, ఆగమ్యాత్=వచ్చుఁగాక.

౧౨౧. ౧. మీపాదపద్మములకు నమస్కరించుటచేత నాజన్మము సఫలమైనది. మీయనుగ్రహమువలన నాపూర్వు లందఱు నేఁడు స్వర్గలోకమును పొందినారు.

౨. పూజ్యులగు మీకు (తగినంతసత్కారము చేయుశక్తి లేక లభించినంత వఱకు) కూరరో కాయరో యొసంగి మీకు శ్రమ కలుగఁజేసినాను. ఈశ్రమను మఱచి మాయపరాధముల క్షమింపుఁడు.

౧౨౨. * (స్వాదుషగ్ం...ఈశత॥ తై. సం. ౪-౬-౬-౧) పితరః=మా పితరులు, స్వాదుషంసదః=మాచేత శ్రద్ధాపూర్వకముగ ఇయ్యఁబడినమృదువయిన అన్నముచేత తృప్తి నందియున్నారు. వయోధాః=మా కాయుర్వృద్ధిని కలుగఁ జేయ శక్తి కలిగియున్నారు. కృచ్ఛ్రేశ్రితః=ఆపత్కాలమునందు ఆపన్నివారణార్థ ము ఇతరులచేత ఆశ్రయింపఁదగియున్నవారలు, గభీరాః=అగాధమయిన బుద్ధిగల వారలు, చిత్రసేనాః=వివిధమయిన గజాశ్వరథాదిసైన్యబలము కలిగినవారలు, ఇషుబలాః=బాణములచేత యుద్ధము చేయుటయందు సమర్థులయినవారు, అమృధ్రాః=శత్రువులచేత ఎదుర్కొనుటకు సాధ్యులు కానివారు, సతోవీరాః= లోకమునందున్న శూరులకంటె పరాక్రమవంతులయినవారు, ఉరవః=విస్తార మయినధనసేనాదిసమృద్ధిగలవారలు, వ్రాతసాహాః=శత్రుసమూహమును పరాభ వింప సమర్థులయినవారలు.

(మఱియు,) పితరః=నాపితరులు, బ్రాహ్మణాసః=వేదార్థము నెఱింగినవార లు, సోమ్యాసః=(కావుననే మాయందు) అనుగ్రహముకలిగినవారలు, ద్యావా పృథివీ=(మాపితరులవలెనే) ఆకాశము భూమియున్నూ, అనేహసా=సర్వకాల

ములయందును, నః=మమ్ములనుగూర్చి, శివే=అనుగ్రహముగలవి (అగుఁగాక.) ఋతావృధః=యజ్ఞమును వృద్ధిచేసెడి, పూషా=పోషకుఁడగుదేవుఁడు, నః=మమ్ములను, దురితాత్ =పాపమునుండి, పాతు=కాపాడుఁగాక. (ఓపితృదేవతలారా!) రక్ష=మమ్ములను కాపాడుఁడు. నః=మాయొక్క, అఘశంసః=పాపమునుమాత్రమే చెప్పుటయందు ఆసక్తిగల నిందకులు, మాకిః ఈశత=నిందించుటకు సమర్థులు కాకపోవుదురుగాక.

౧౨౩. * (ఇహైవ...గృహే॥ ఏకా. ౧-౮.) ఇహ ఏవ=ఈలోకమునందే, ఉ స్తం=మీరుండుఁడు. మావియోష్టం=మీకు వియోగము కలుగకుండుఁగాక. విశ్వం ఆయుః=సంపూర్ణమయిన ఆయుస్సును,వ్యశ్నుతం=పొందుఁడు. పుత్రైః=పౌత్రులతోడను,న ప్తృభిః=మునిమనుమలతోడను, స్వేగృహే=స్వగృహమునందు, మోదమానౌ=సంతుష్టులయి యుండి, క్రీడంతు=ఆడుకొనుచుందురుగాక. (మీరు వియోగము లేనివారై నూఱుసంవత్సరములు జీవించి స్వగృహమునందు పుత్రపౌత్రప్రపౌత్రసంతతికలిగి వారితోడ నిత్యసంతోషములు కలిగి యుందురుగాక యని తాత్పర్యము.)

సర్వస్య=సమస్తమయినదానియొక్క, ఆప్త్యై=పొందుకొఱకు అగుఁగాక. సర్వస్య జిత్యై=సమస్తమయినదానిని జయించుకొఱకు(అగుఁగాక). తేన=ఆబ్రాహ్మణానుగ్రహముచేత, సర్వం ఏవ=అంతయు, ఆప్నోతి=పొందుచున్నాఁడు. సర్వం=అంతయు, జయతి=జయించుచున్నాఁడు.

౧౨౪. * (శత...ష్ఠతి॥ తై. సం.౨-౩-౧౧) శతమానం=నూఱుసంఖ్యగలది, భవతి=అగుచున్నది. పురుషః=పురుషుఁడు, శతాయుః=నూఱుసంవత్సరములు ఆయుస్సుకలవాఁడగుచున్నాఁడు. శతేంద్రియః=అధికముగ ఇంద్రియసామర్థ్యము గలవాఁడై, ఆయుషి=ఆయుస్సునందున్న, ఇంద్రియే=ఇంద్రియసామర్థ్యమునందున్న, ప్రతితిష్ఠతి ఏవ=ప్రతిష్ఠను పొందుచున్నాఁడు.

౧౨౫. పరమేశ్వరుఁడు మాకు ఆయుస్సు, సంతానము, ధనము, విద్య, స్వర్గము, మోక్షము, సుఖము, రాజ్యము మున్నగువానిని ప్రీతితో కలుగఁజేయుఁగాక.

౧౨౬. * (వాజే...యానైః॥ తై. సం. ౧. ౪. ౮.) వాజినః=అన్నము కలిగినట్టియు, అమృతాః=శ్రమలేనట్టియు, ఋతజ్ఞాః=సత్యమెఱింగినవారును అగు, విప్రాః=ఓబ్రాహ్మణోత్తములారా! వాజేవాజే=అన్ననిమిత్తమున్నూ, ధనేషు=ధననిమిత్తమున్నూ, నః=మమ్ములను, అవత=సంరక్షింపుఁడు. అస్య=ఈ, మధ్వః=మధురమయిన పదార్థమును. పిబత=స్వీకరింపుఁడు. మాదయధ్వం=సంతుష్టులుకండు. తృప్తాః=సంతుష్టులయి, దేవయానైః=దేవతలు పోవునట్టి, పథిభిః=మార్గములచేత, యాత=పోవుఁడు.

౧౨౪. * (ఉత్తిష్ఠత... తాసు॥ ఆప. శ్రౌ. ౧-౧౦-౬) శూరాః = పరాక్రమముగలవారలును, అనపేతాః = సన్మార్గమునుండి తొలఁగనివారలును అగు, పితరః = ఓపితృదేవతలారా! (మీరు) ఉత్తిష్ఠత = లెండు. పురాణం = పురాతనమయిన, యమస్య = యమునియొక్క, పంథాం = మార్గమునుగూర్చి, ప్రేత = పొండు. యత్ చ = ఏ, ద్రవిణం = దైవికమానుషములను భేదముగల ధనమును, భద్రం = శుభమును (గలదో దానిని) అస్మాసు = మాయందు, ధత్తాత్ = ఉంచుఁడు. (ఓపితరులారా! మీరు) దేవతాసు = దేవతలయందు, నః = మాయొక్క, భాగధాం = పిండప్రదాన, బ్రాహ్మణభోజన, అగ్నౌకరణాదిరూపమున పితృదేవతలనుగూర్చి మేమాచరించిన సత్కర్మమును, ప్రబ్రూతాత్ = చెప్పుఁడు. (తా. ఓపితరులారా! మీరు మీయందుఁగల ధనమును శుభమును మా కనుగ్రహించినవారలై మరల మీరుండు పితృలోకమునుగూర్చి సుఖముగా పొండు. మేము శక్తికొలఁది పితరులఁగూర్చి యీశ్రాద్ధకర్మమును, ఆచరించినటులు దేవతలకుఁ జెప్పవలయును.)

౧౨౫. * (కయాన... వృతా॥ తై.సం. ౪-౨-౫-౨) కయా = ప్రజాపతిసంబంధమయిన, ఊతీ = సంరక్షణచేత, సదావృధః = ఎల్లప్పుడు క్రమముగ వృద్ధిపొందుచున్నదియు, సఖా = మిత్రునివలె ప్రియముకలుగఁజేయునట్టిదియు నగు, చిత్రః = చిత్రమయినయజ్ఞము, నః = మమ్ములనుగూర్చి, అభువత్ = వచ్చెను. ఆయజ్ఞము, శచిష్ఠయా = అతిశయమయిన సామర్థ్యముగల, కయా = ప్రజాపతిసంబంధమయిన శక్తితో, వృతా = కూడుకొనియున్నది.

౧౨౬. * (వామదేవాయ... నమః॥ తై. ఆ. ౧౦-౧౫.) వామదేవాయ = సుందరమయి ప్రకాశించుచున్న (ఈశ్వరునియొక్క) ఉత్తరముఖమునకొఱకు, నమః = నమస్కారము. జ్యేష్ఠాయ = అన్నిటికంటె ముందు పుట్టుటచేత జ్యేష్ఠమయిన ఆముఖమునకొఱకు, నమః = నమస్కారము. శ్రేష్ఠాయ = శ్రేష్ఠమయిన ఆ ఉత్తరముఖమునకొఱకు, నమః = నమస్కారము. రుద్రాయ = ప్రళయకాలమునందందఱకు రోదనహేతువగు ఆవక్త్రముకొఱకు, నమః = నమస్కారము. కాలాయ = (సర్వప్రాణిప్రాణక్షయహేతువగుటవలన) కాలస్వరూపమగు ఆముఖమునకొఱకు, నమః = నమస్కారము. కలవికరణాయ = సుఖమును గ్రహించునదియు, వివిధజగత్తును చేయునదియు నగు ఆముఖమునకొఱకు, నమః = నమస్కారము. బలవికరణాయ = (రాక్షసుల యొక్క) బలమును హింసించుదానికొఱకు, నమః = నమస్కారము. బలాయ = సకలశక్తులకు స్థానమగుటచేత బలరూపమగుదానికొఱకు, నమః = నమస్కారము. బలప్రమథనాయ = స్వేచ్ఛగా సకలశక్తులను ఉపసంహారము చేయునట్టి ఆముఖమునకొఱకు, నమః = నమస్కారము. సర్వభూతదమనాయ = సకలభూతముల

శిక్షించునట్టి ఆయుత్తరముఖమునకు, నమః = నమస్కారము. మనోన్మనాయ = సర్వజ్ఞమయిన ఆముఖమునకొఱకు, నమః = నమస్కారము.

౧౩౦. *(అష్టా... ప్రీణాతి॥ తై. సం. ౫-౪-౧౧) అన్యేషు = ఇతరములగు (ప్రశాస్త్రీయ పోత్రీయ నేష్ట్రీయ, అచ్ఛావాకీయాది,) ధిష్ణ్యేషు = స్థానములందు, అష్టాఅష్టా = ఎనిమిదేసి ఇష్టకలను, ఉపదధాతి = ఉంచుచున్నాఁడు. పశవః = పశువులు, అష్టాశఫాః = ఎనిమిది గిట్టలు కలిగియున్నవి. పశూన్ ఏవ = పశువులనే, అవరుంధే = పొందుచున్నాఁడు. మార్జాలీయే = మార్జాలీయ స్థానమునందు, షట్ = ఆఱుఇష్టకలను (ఉంచుచున్నాఁడు) ఋతవః = ఋతువులు, షట్ వా = ఆఱు, దేవాః పితరః = దేవతలు, పితరులును, ఋతవః ఖలువై = ఋతుస్వరూపులు కనుక, ఋతూన్ = ఋతుస్వరూపులగు, దేవాన్ పితౄన్ = దేవతలను, పితరులను, ప్రీణాతి = తృప్తినిపొందించుచున్నాఁడు.

ఆబ్దికమంత్రములకు టీకాతాత్పర్యములు సమాప్తము.

---

## ప్రాయశ్చిత్తోపాసనము: టీకాతాత్పర్యములు.

౧. (తాత్పర్యమచటనే కలదు.)

౨. * (చత్వారి... వేశ॥ తై. ఆ.) అస్య = ఈ(యజ్ఞస్వరూపుఁడగు) అగ్నికి, చత్వారి = నాల్గు(వేదములే) శృంగాః = కొమ్ములు, త్రయః = మూఁడు (ప్రాతః, మాధ్యందిన, సాయంసవనములు) పాదాః = పాదములు, ద్వే = (బ్రహ్మోదన, ప్రవర్గ్యములు) రెండు, శీర్షే = శిరస్సులు, సప్త = (ఛందస్సులు) ఏడు, హస్తాసః = హస్తములు, త్రిధా = (మంత్ర, కల్ప, బ్రాహ్మణములచేత) మూఁడువిధములుగా, బద్ధః = కట్టఁబడినవాఁడై, వృషభః = (అభీష్టములను) వర్షించుచున్నవాఁడై, మహః = మహాత్ముఁడగు, దేవః = దేవుఁడు, మర్త్యాన్ = మనుష్యులను, ఆవివేశ = ప్రవేశించెను. (అని) రోరవీతి = హర్షధ్వనితో తెలుపుచున్నాఁడు.

౧. పైమంత్రార్థమే ఇచట శ్లోకములతో వివరింపఁబడుచున్నది. అగ్నిహోత్రుఁడు ఏడుచేతులు, నాలుగు కొమ్ములు, ఏడునాలుకలు, రెండుశిరస్సులు, మూఁడు పాదములును కలిగి ప్రసన్నమయిన ముఖమును, స్వచ్ఛమయిన చిఱునగవును కలవాఁడయి సుఖముగాఁ గూర్చుండియున్నాఁడు.

౨. తనదక్షిణభాగమునందు స్వాహాదేవిని, ఎడమభాగమునందు స్వధాదేవిని ధరించినవాఁడయి నాల్గుకుడిచేతులచేత శక్తి, అన్నము, స్రుక్కు, స్రువము అను హోమసాధనములను (మూఁడు ఎడమచేతులచేత) తోమరమును, విసనకఱ్ఱను, ఆజ్య

పాత్రను ధరించినవాఁడై యున్నవానిగను, మేషము నెక్కినవానిగను, జడలు ధరించినవానిగను, గౌరవర్ణము గలవానిగను, గొప్పకాంతి గలవానిగను,

౪. పొగను పతాకముగా ధరించినవానిగను, ఎఱ్ఱనికన్నులు గలవానిగను, ఏడువిధములగు జ్వాలలు కలవానిగను, సకలాభీష్టముల భక్తుల కిచ్చువానిగను, తనకు ఎదురుగా కూర్చున్నవానిగను, ఇట్టి స్వరూపముగలవానిగా అగ్నిహోత్రుని ధ్యానించవలయును.

3. * (ఏష...ఖః॥ తై. ఆ. ౧౦-౧-౧౪) ఏషః = ఈ, దేవః = స్వయం ప్రకాశమానుఁడగు (అగ్ని) సర్వాః ప్రదిశః = తూర్పు మొదలగు సకలదిక్కులను, అను హి = ప్రవేశించియున్నాఁడనువిషయము సుప్రసిద్ధముగదా ! సః = ఆస్వయం ప్రకాశమానుఁడగు అగ్నియే, పూర్వః జాతః = హిరణ్యగర్భుఁడనురూపముచేత ప్రథముఁడై పుట్టెను. సః ఉ = ఆపరమాత్మస్వరూపుఁడగు అగ్నియే, గర్భే అంతః = ఈబ్రహ్మాండముయొక్క మధ్యభాగమునందున్నా, (ఉంటున్నాఁడు). సః = ఆపరమాత్మ స్వరూపుఁడగు ఈయగ్నియే, విజాయమానః = దేవతిర్యగాది రూపములచేత ఇప్పుడు పుట్టుచున్నాఁడు. సః ఉ = ఆపరమాత్మస్వరూపుఁడగు అగ్నియే, జనిష్యమాణః = ఇఁకమీఁదనున్నా పుట్టఁగలఁడు. ప్రత్యజ్ = (ఇతఁడే దేహమునందుఁ గల అన్నమయాది కోశములకంటె,) విలక్షణమయినవాఁడు (మఱియు) ముఖాః = (దేహేంద్రియములకు అధ్యక్షుఁ డగుటవలన) ముఖ్యుఁడును (అగుచున్నాఁడు) ఇట్టియగ్నియే, విశ్వతోముఖః = అంతట ముఖములుగలవాఁడై (జగదధిష్ఠానముగా) తిష్ఠతి = ఉంటున్నాఁడు.

౪. (చూ. ఆబ్దికమంత్ర సంఖ్య. ౭-౫.

౫. * (అయా...స్వాహా॥ ఏకా. ౧. ౫.) అగ్నే = ఓయగ్నిదేవా! (నీవు,) అయాః = భక్తులను పొందువాఁడవు, అసి = అగుచున్నావు. అనభిశస్తీః చ = దోషరహితుఁడవుగానున్నా, (అసి = అగుచున్నావు) సత్యం ఇత్ = సత్యస్వరూపుఁడవగు, త్వం = నీవు, అయాః = భక్తులచేతను పొందఁ దగినవాఁడవు, అసి = అయితివి. (అట్టినీవు) అయసా = నిన్ను పొందిన, మనసా = మనస్సుతో, ధృతః = (మాచేత నీవు) ధరింపఁబడినవాఁడవు అయితివి. (ఓయగ్నిదేవా! నీవు) అయసా = మమ్ములనుపొందిన మనస్సుతో, హవ్యం = (దేవతలకు మే మిచ్చెడు) హవిస్సును, ఊహిషే = (దేవతలకు) పొందింపుము. అయాః = నీవు మాచేత పొందఁబడినవాఁడవై, నః = మాకొఱకు, భేషజం = భయనివారణము, ధేహి = కలుగచేయుము (ఓయగ్నిదేవా! నీవు భక్తులకు శరణమునిచ్చువాఁడవు. పవిత్రుఁడవు. సత్యస్వరూపుఁడవు. ఇట్టినిన్ను హృదయపూర్వకముగ మేము శరణు పొందుచున్నాము. మేము నీయందు శ్రద్ధా

భక్తులతో హోమము నొనర్చిన హవిస్సును ఆయాదేవతల కొసంగుము. మాకు భయము లేకుండునటు లనుగ్రహింపుము.

౬. * (మహోహవిః... స్వాహా॥ తై. ఆ. ౩-౫-౧.) హోతా = హోతయను ఋత్విజుఁడు, మహోహవిః = "మహోహవి" యను ఋషిస్వరూపుఁడు. అధ్వర్యుః = అధ్వర్యుఁడను ఋత్విజుఁడు, సత్యహవిః = సత్యహవిఋషిస్వరూపుఁడు, అగ్నిత్ = అగ్నిధ్రుఁడను ఋత్విజుఁడు, అచ్యుతపాజాః = అచ్యుతపాజుఁడను ఋషిస్వరూపుఁడు. ఉపవక్తా = బ్రహ్మయనుఋత్విక్కు, అచ్యుతమనాః = అచ్యుతమనుఁడనుఋషిస్వరూపుఁడు. యజ్ఞస్య = యజ్ఞమునకు, అభిగరౌ = అభిగరులు, అనగా, ప్రస్తోతృ, ప్రతిహర్తలనుఋత్విజులు, అనాధృష్యశ్చ, ప్రతిధృష్యః చ = అనాధృష్య, ప్రతిధృష్యులను మహర్షులు. ఉద్గాతా = ఉద్గాతయను ఋత్విజుఁడు, అయాస్యః = అయాస్యుఁడనుఋషి, హృద్విధే = హృదయప్రేరకుఁడవును, నామ = (అందఱిచేత) నమస్కరింపఁదగినవాఁడవును అగు) వాచస్పతే = ఓవాచస్పతీ! తే = నీకు, నామ = నమస్కారమును, విధేమ = చేయుచున్నారము. త్వం = నీవు, అస్మాకం నామ = మాయొక్క పేరును, విధేః = దేవతలతో చెప్పుము. వాచస్పతిః = వాచస్పతి, సోమం అపాత్ = (మాయజ్ఞమునందు) సోమపానము చేసెను. (అందువలన) దైవ్యః తంతుః = (మాగృహమునందు) దేవతాసమూహము, మాఛేది = విచ్ఛేదమును పొందకపోవుఁగాక. మనుష్యః తంతుః = మనుష్యసంతతి (అనఁగా పుత్రపౌత్రప్రపౌత్రాదిక్రమముగ మనుష్యపరంపర) మాఛేది = విచ్ఛేదమును పొందక పోవుఁగాక. దివే = ద్యులోకము కొఱకు, నమః = నమస్కారము. పృథివ్యై = పృథివికొఱకు, నమః = నమస్కారము.

౭. * భూః, భువః, సువః = భూర్భువస్సువర్లోకాభిమానిదేవతలకొఱకు, స్వాహా = ఈయాహుతియగుఁగాక.

☞ హోమాదియందు, అదితేఽనుమన్యస్వ, అనుమతేఽనుమన్యస్వ, సరస్వతేఽనుమన్యస్వ, దేవసవితః ప్రసువ అని పూర్వపరిషేచనము:—తదర్థము.

అదితే = (దేవమాతవగు) ఓఅదితీ! అనుమన్యస్వ = (నేను చేయఁబోవు హోమక్రియను) అంగీకరింపుము. అనుమతే = ఓ అనుమత్యభిమానిదేవతా! (అనుమతి యనఁగా చతుర్దశీయుక్త పూర్ణిమయందు ఒకకళ తక్కువగా ఉన్నపూర్ణిమకు అభిమానిదేవత) సరస్వతే = ఓసరస్వతీ, అనుమన్యస్వ = (నేను చేయఁబోవుహోమక్రియను) అంగీకరింపుము. సవితః దేవ = ఓసవితృదేవా! ప్రసువ = (అందఱియొక్కయనుజ్ఞ కలుగునటులు) అంగీకరింపుము. ఇది పూర్వపరిషేచనము.

"అదిఽతేన్వమగ్గ్ స్థాః, అనుమతేఽన్వమగ్గ్ స్థాః, సరస్వతేఽన్వమగ్గ్ స్థాః, దేవసవితః ప్రాసావీః" అని ఉత్తరపరిషేచనము.

అదితే = ఓయదితీ! అన్వమంస్థాః = (నే నొనర్చిన హోమక్రియను నీవు)అను గ్రహించితివి. ఇట్లే తక్కిన 3 వాక్యములకు అర్థమును గ్రహించవలయును.

౭. ౧. ఓయగ్నిదేవా! శ్రద్ధను, మేధను, కీర్తిని, ప్రజ్ఞను, విద్యను, బుద్ధిని, సంపత్తును, బలమును, ఆయుష్యమును, తేజస్సును, ఆరోగ్యమును నా కొసంగుము.

౨. దానతపోహోమక్రియల నాచరించునప్పుడు ఏదేవతను స్మరించుటచేత సాధనసంపత్తి పరిపూర్తి లేకపోయినను ఆదాన తపోహోమాదిక్రియలుపరిసమాప్తి యగుచున్నవో అట్టియగ్ని హోత్రునకు నమస్కారము.

3. ఓయగ్నిదేవా! తగినంత మంత్రసంపత్తు, క్రియాచరణము, భక్తియు లేక పోయినను నేను దేనిని నీకు హుత మొనర్చితినో దానిచేత నే నీవు సంతృప్తుఁడవు కావలయును.

నాల్గు సముద్రముల మధ్యభాగమునందుండు, గోబ్రాహ్మణాది సర్వప్రాణి సమూహమునకు శుభమగుఁగాక. అంగీరసుఁడు, బార్హస్పత్యుఁడు, భారద్వాజుఁ డను 3 మహర్షులు ప్రవరర్షులుగాఁగల భారద్వాజగోత్రమున జన్మించినవాఁడను, యజుర్వేదమునకు సంబంధించినశాఖలలో నొకటగు తైత్తిరీయ శాఖను అనఁగా వేద శాఖను పఠించువారిశాఖను చేరినవాఁడను, ఆపస్తంబసూత్రుఁడను. నారాయణశర్మ అను పేరుగల నేను నమస్కరించుచున్నాఁడను. నేను నమస్కరించునది నాయొక్క నిక్షేమార్థముమాత్రము. లేక మనుష్యులందఱకుమాత్రమే కాదు. ప్రపంచమునం దుండు సకల ప్రాణిసమూహముయొక్క యోగక్షేమార్థము నని భావము. "గోబ్రాహ్మణేభ్యః" అనుచోట గోశబ్దము, మనుష్యేతరములగు పశుపక్ష్యాది సర్వప్రాణిసమూహమున కుపలక్షకము. బ్రాహ్మణ యనుపదము నానావిధజాత్యుపలక్షిత మనుష్యసముదాయోపలక్షణము.

## ప్రాయశ్చిత్తోపాసనము సమాప్తము.

౯. *(ఉపావరో...దురోణే॥ తై. బ్రా. ౨. ౫. ౭. ౭.) ఇది సమిదాధానమంత్రము:—జాతవేదః = ఓయగ్నీ!(నీవు)ఉపావరోహ = (సమిత్తునుండి యీ స్థండిలప్రదేశమునందు)అవతరింపుము. (అట్లవతరించినవాఁడవై)ప్రజానన్ = ఈదేవతకీహవిస్సియ్యఁబడిన దనువిషయము) నెఱింగినవాఁడవై, నః = మాసంబంధమయిన, హవ్యం = హవిస్సును, దేవేభ్య: = దేవతలకొఱకు, వహ = పొందింపుము, ఆయుః = ఆయుస్సును, ప్రజాం = సంతానమును, రయిం = ధనమును, అస్మాసు = మాయందు, ధేహి = ఉంచుము. అజస్రః = ఎల్లప్పుడును ఉండునీవు, నః = మాయొక్క, దురోణే = గృహమందు, దీదిహి = ప్రకాశించుచుండుము.

౧౦. * (అయం...రయిమ్॥ తై. బ్రా. ౨. ౫. ౭. ౭.) ఇది సమిదారోపణమంత్రము. (ఓయగ్నీ!)అయం = ఈసమిథ, తే = నీకు, ఋత్వియః యోనిః =

ఋతువిశేషమునందు పుట్టుటకు కారణ మగుచున్నది. యతః = ఏసమిత్తునుండి, జాతః = పుట్టిననీవు; అరోచథాః = ప్రకాశించుచున్నాఁడవో, అగ్నే = ఓయగ్నీ! నీవు, తం = ఆవిషయమును, (అనఁగా ఈసమిధనుండియే నేను పుట్టినాఁడ ననువిషయమును) జానన్ = ఎఱింగినవాఁడవై, ఆరోహ = ఈసమిత్తును అధిష్ఠింపుము. అథ = పిమ్మట, నః = మాకు, రయిం = ధనమును, వర్ధయ = వృద్ధినిపొందింపుము.

౧౧. ౧౨. ౧౩. (చూ. ప్రాయశ్చిత్తోపాసనము. ౨-౩-౪.)

౧౪. చూ. (ఆబ్దికమంత్రసంఖ్య ౭౫.

౧౫. అగ్నయే = (ఈయియ్యఁబడిన హవిస్సు) అగ్నిదేవతకొఱకు, స్వాహా = సుహుతమగుఁగాక.

౧౬. స్విష్టకృతే = (భక్తుల కభీష్టములను సులభముగా నిచ్చుచుండుటచేత స్విష్టకృత్తని పిలువఁబడుచున్న, అగ్నయే = అగ్నికొఱకు, స్వాహా = (ఈ యియ్యఁబడినహవిస్సు) సుహుత మగుఁగాక.

౧౭. * (యత్రై...మయ॥ తై.) వనస్పతే = ఓవనస్పతీ! సమిధమా నీవు, యత్ర = ఏస్థానమునందు, దేవానాం = దేవతలయొక్క, గుహ్యనామాని = రహస్యరూపములను, వేత్థ = తెలిసికొనుచున్నావో, తత్ర = అచ్చటకు, హవ్యాని = హవిస్సులను, గామయ = పొందింపఁజేయుము.

౧౮. *(అగ్నే...స్మాత్॥ తై. సం. ౪. ౪. ౪.) అగ్నే = ఓయగ్నీ! త్వం = నీవు, నః = మాకు, అంతమః = అతిసమీపస్థుఁడవుగా నున్నావు. ఉత = మఱియు (త్వం = నీవు) త్రాతా = రక్షకుఁడవును, శివః = సుఖము కలుగఁజేయువాఁడవును, భవ = అగుము. వరూథ్యః = నాగృహమునందు సన్నిహితుఁడవయి ఉండుము. శోచిష్ఠ = మిక్కిలి పవిత్రుఁడవును, దీదివః = తేజస్సుతో ప్రకాశించువాఁడవును అగు ఓయగ్నీ! తం = అట్టి, త్వా = నిన్ను, సఖిభ్యః = మా స్నేహితులయొక్కయు, సుమ్నాయ = సుఖముకొఱకు, నూనం = నిశ్చయముగా, ఈమహే = శరణుపొందుచున్నారము.

వసుః = ధనముగలవాఁడవును, అగ్నిః = శ్రేష్ఠుఁడవును, వసుశ్రవాః = వస్వాదిదేవతలచేత ఆదరముగా శ్లాఘింపఁబడుచున్న ఓయగ్నీ! ద్యుమత్తమః = అధికకాంతిగల నీవు, అచ్ఛ = మా కభిముఖముగా, నక్షి = మమ్ములను పొందుము. రయిం = ధనమును, దాః = (మాకొఱకు) ఇమ్ము.

(ఓయగ్నిదేవా!) సః = అట్టినీవు, నః = మమ్ములను, బోధి = కనుఁగొనుము. హవం = మేము పిలుచుటను, శ్రుధి = వినుము. అఘాయతః = పాపము నాచరించు, సమస్మాత్ = సకలజనులనుండి, ఉరుష్య = కాపాడుము.

౧౯, ౧. * (అనాజ్ఞాతం. తై. బ్రా. ౩-౭-౧౧) యజ్ఞస్య = యజ్ఞసంబంధమయిన, యత్ = ఏ యంగము, అనాజ్ఞాతం = తెలిసికొనఁబడనిదై, మిథు = తప్పగా, క్రియతే = చేయఁబడుచున్నదో, అగ్నే = ఓయగ్నీ, అస్య = ఈకర్మసంబంధమగునట్టి, తత్ = ఆయంగమును, కల్పయ = ఫలప్రదమయినదానినిగా చేయుము. త్వం = నీవు, యథాతథం = కర్మములయొక్క, యథార్థతత్త్వమును, వేత్థ = తెలిసికొనుచున్నావు. (స్వాహా యని హోమము చేయవలయును.)

౨. యజ్ఞః = యజ్ఞము, పురుషసమ్మితః = పురుషునితో సమానమైనది. యజ్ఞః = యజ్ఞము, పురుషసమ్మితః = పురుషునిచేతఁ జేయఁబడుచున్నది. అగ్నే = ఓయగ్నీ! అస్య = ఈకర్మసంబంధమయిన, తత్ = ఆయంగమును, కల్పయ = ఫలప్రదాన సమర్థముగ నొనర్పుము. త్వం = నీవు, యథాతథం = కర్మముయొక్క యథార్థమయిన తత్త్వమును, వేత్థ హి = ఎఱుఁగుదువుగదా.

౩. పాకత్రాః = బాలురవలె తెలిసికొను సామర్థ్యములేని బుద్ధిగలట్టియు, హీనదక్షాః = అసమర్థులయినట్టియు, మర్త్యాసః = మనుష్యులమగు మేము, యజ్ఞస్య = యజ్ఞసంబంధమయిన, యత్ = ఏయంగమును, నమన్వతే = ఎఱుంగఁజాలమో, తత్ = ఆయంగమునుగుఱించి, విజానత్ = చక్కఁగా నెఱుఁగుదువు.

౨౨. తా. దేవతలకు హావిస్సునొసంగునట్టి ఓయగ్నిదేవా! శ్రద్ధను, మేధను, కీర్తిని, ప్రజ్ఞను, బుద్ధిని, విద్యను, సంపదను, బలమును, ఆయుస్సును, తేజస్సును, ఆరోగ్యమును, నాకొసంగుము. ౧.

తపము హోమము మున్నగు సత్కర్మముల నాచరించునప్పుడు ఏయగ్నిదేవుని స్మరించినను, పేరు దలఁచినను, లోపము లన్నియు సంపూర్ణమయి ఆయాసత్కర్మములు పరిపూర్తి చెందుచున్నవో అట్టి యగ్నిహోత్రునకు నమస్కారము. ౨.

ఓయగ్నిదేవా! మంత్రహీనముగను, క్రియాహీనముగను, భక్తిహీనముగను నేను దేనిని నీయందు హోమ మొనర్చినాఁడనో, అయ్యది యంతయు యథావిధిగ నొనర్చినదానివలె నీకు పరిపూర్ణమగుఁగాక. ౩.

౨౩. దేహముచేతను, వాక్కుచేతను, ఇంద్రియములచేతను, బుద్ధిచేతను, అంతఃకరణముచేతను, స్వభావముచేతను నేను దేనిని చేయుచున్నాఁడనో అది యంతయు శ్రీమన్నారాయణునికొఱకే యగుఁగాక యని సమర్పించుచున్నాఁడను.

౨౪-౨౫-౨౬. (చూ. ఔపాసనమంత్రములు. సంఖ్య. ౧౫-౧౬-౧౪.)

ఔపాసనవిధి సమాప్తము.



---

F. N. 13,14,15,16. Printed at the Kesari Printing Works Madras.

**మంత్ర తంత్రములు:**— మంత్ర రత్నాకరములు, మళయాళమంత్రములు, సమ్మోహన శాస్త్రము, సకలమంత్రోపాసనక్రమము వగైరా.

**వేదాంతములు:**— సీతారామాంజనేయ సంవాదము, శుష్క వేదాంత తమోభాస్కరము, బ్రహ్మవిద్య, కైవల్యనవనీతము, భగవద్గీత, ముముక్షుజనకల్పము, భంహాలుసేన్ దాసు తత్వములు, వేమనపద్యములు, శివగీత, సుజ్ఞానరత్నావళి వగైరా.

**ఉపనిషత్తులు:**— కొలది రకములు.

**సంస్కృతకావ్యములు, నాటకములు:**— నీతిశాస్త్రములు, భర్తృహరి సుభాషితము, రఘువంశము ఇంకా ఇతరములు.

**వ్యాకరణము, అలంకారము:**— శబ్దమంజరి వగైరా.

**నిఘంటువులు, అమరము:**- ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రపదపారిజాతము, గురుబాలప్రబోధిక వగైరా.

**ఆంధ్రగ్రంథములు:**— అపూర్వ సంఘసంస్కరణము, భారతము, భాగవతము, రామాయణము, గుప్తభావప్రదీపిక, చాటుపద్య మణిమంజరి, శృంగారకంఠాభరణము, శృంగార రసాలవాలము, శృంగార సావిత్రి వ॥.

**శతకములు:**— కవిచౌడప్ప శతకము, కన్యకాంబతారావళి, కాళగుణాదర్శనము అను శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము, పెద్దచ్చు శతకములు, టీకా తాత్పర్య శతకములు వగైరా.

**కథలు, వచనములు:**— నిజమైన కాశీమజలీ కథలు, కాశీ రామేశ్వర యాత్రాదర్పణము, తెనాలిరామలింగని వింత కథలు, నలుగురు పకీర్ల కథలు, మదనకామరాజు కథలు మొదలగు చాలారకములు గలవు.

**నవలలు:**— అనురాగవిపాకము, సుశీలామైనావతి, రాజమండ్రి, బెజవాడ, చెన్నపట్నము వగైరాలు ఎన్నోవందల నవలలు గలవు.

**జీవిత చరిత్రములు:** — ఆసియాఖండ విజ్ఞాన రహస్యములు, దేశనాయకుల చరిత్రలు వగైరా.

**ఆనందమయములు:**— పడకటింటి రహస్యాలు, సతీపతి కుతూహల రహస్యములు వగైరా.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.

డ్రామాలు:- బలిజేపల్లి, పానుగంటి, రామనారాయణ, చక్రపాణి ధాటులు, కోలాచల, చిలకమర్తి, ద్రోణంరాజు, చెన్నపట్నం, కాకినాడ, బెజవాడ, రాజమండ్రి వగైరా ప్రాంతముల ఎన్నోవందల డ్రామాలుకలవు.

కీర్తనలు:- అధ్యాత్మరామాయణము, కబీరుదాసు, భగవన్నామ, రామదాసు, హరిభజన, హరినామ వగైరా కీర్తనలు.

హరికథలు:- అనసూయ, చంద్రహాస, సావిత్రి, పెద్దదాసు, రుక్మాంగద వగైరాలు.

నాటకములు:- ధర్మాంగద, మైరావణ, సంతవేలూరు, ప్రహ్లాదలు, వీరభద్ర. రామ నాటకములు వగైరాలు.

పదములు:- కుశలాయకం, గంగావివాహము, వైకుంఠమహాత్మ్యం, శారదరామాయణము మొదలగునవి.

జంగంకథలు:- కాంభోజ, కామమ్మ, బొబ్బిలి, బాలనాగమ్మ, కుమ్మరి గుండయ్య వగైరా.

యక్షగానములు:- కపటవేశ్యా నాటకము, రుక్మాంగద, గరుడాచలము వగైరా.

పాటలు:- ఊర్మిళాదేవి. తులసిగోవిందము. పడవపాట. మేలుకొలుపులు. విచిత్ర విడికథ సవాలు. లడ్డూ. పకోడి సంవాదం చెన్నపట్నం. బెజవాడ, రాజమండ్రి. మొదలగునవి.

ద్విపదలు:- బాలభాగవతము. నలచరిత్ర. వగైరాలు.

సంగీతములు:- గాయనగాయనీయ పారిజాతము. సంగీతసర్వార్థ సారసంగ్రహము. గానవిద్యావినోదిని. గట్టుపల్లివారివి మొదలగునవి.

వైద్య గ్రంథములు:- వాహటము. చింతామణి. ప్రసిద్ధఆంగ్లేయఔషదయోగములు. వైద్యనిఘంటువులు. శుశ్రుతశారీరస్థానం చెన్నపట్నం, రాజమండ్రి. బెజవాడ తదితర ప్రాంతముల వైద్య గ్రంథములు చాలకలవు.

జ్యోతిషగ్రంథములు:- కాలచక్రం. బృహజ్జాతకం. చెన్నపట్నం. బెజవాడ. రాజమండ్రి. కాకినాడ తదితర ప్రాంతముల వగైరా ఎన్నోకలవు.

ఆటలు, పాకశాస్త్రములు, ఫారుములు, వర్తక మర్మములు మొదలగునవి.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ. బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురామయ్యగారి సందు;
బుర్జుపేట. విశాఖపట్నము.

బృహజ్జాతకము 2-0-0 గ్లేజు 3-0-0
[illegible]లచరిత్రము 1-0-0 గ్లేజు 1-8-0
జ్ఞానప్రదీపిక అను మళయాళ ప్రశ్నలు
వెల 5-0-0
తిలక ఫల విజ్ఞానమను పుట్టుమచ్చల ఫలము 0-3-0
కేరళ పంచపక్షి ప్రశ్న శాస్త్రము 0-8-0
రసయోగ రత్నాకరము 2-0-0
సుశ్రుత శారీరస్థానము 2-8-0
సర్పశాస్త్రము 0-8-0
షర్బత్ పాక రత్నావళి 0-6-0
సహదేవ పశుచికిత్స 0-6-0
వైద్య శతశ్లోకి 0-4-0, 0-6-0
అనుపాన మంజరి 0-8-0
నాడీనిదానము తాత్పర్యం 0-4-0
నాడీజ్ఞానము 0-4-0
బ్రహ్మవిద్య . 0-2-0
శుష్క వేదాంత తమోభాస్కరము 3-0-0
సీతారామాంజనేయ సంవాదము
సంగ శేషాచలశాస్త్రిగారి ఆంధ్రటీకా
తాత్పర్య విశేషార్థ సమన్వితము
వెల 3-8-0 గ్లేజు 6-0-0
కైవల్యనవనీతము 5-8-0
ధ్యానామృతం 0-6-0
సమ్మోహనశాస్త్రము అందు అదృశ్య
కాజము 1-8-0
అభ్యాసన చక్రము 0-4-0

వేదాంత భక్తికీర్తనలు 0-1
యోజుషప్రయోగ చింతామణి 2-0
ప్రేతచూడామణి 2-0
సకల మంత్రోపాసనక్రమము 0-6
దేవీస్తోత్రకదంబము 0-8
శివస్తోత్రామృతం 0-4
కవిచౌడప్ప శతకం 0-2
కల్కిపురాణము 0-12-0, 1-4
తెనాలిరామలింగని కథలు 0-4
రంగదాసు భజన కీర్తనలు 0-4
సుశీల మైనావతి 0-
మరకతవల్లి 0-1
శమంతసేన 0-
దొరికితివిరా దొంగ 0
నేనే [illegible]ంగను
విషాద వాసంతిక 0
వలపుల మడుగు 0
శకుంతల జనన నాటకం
వైకుంఠ మహాత్మ్యం
ఉషాకళ్యాణం బాణాసురయుద్ధం 0
కపటవేశ్యా నాటకం 0
మైరావణ నాటకం
ధర్మాంగద నాటకం (పాలుట్ల)
ఉషా నాటకం (తిరునగరు) 0
వీరభద్ర నాటకం త్వరకవి 0
పడకటింటి రహస్యాలు 1
ఇంకా అనేక రకములు గల[illegible]


కాలమానపరిస్థితుల ననుసరించి ధరలు మారుచుండును.

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిష[illegible]
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బురుజుపేట, విశాఖపట్నము.



నవీన ప్రింటర్సు. విశాఖపట్నం.